# మతంమార్పిళ్లు - నైతిక విలువలు




ప్రజ్ఞా భారతి చర్చావేదికలో

ప్రసంగాల పూర్తిపాఠం



అనువాదం

కె. కేశవనాథ్

ప్రజ్ఞా భారతి

ఆంధ్రప్రదేశ్

# మతంమార్పిళ్లు నైతికవిలువలు

15 అక్టోబరు 1999

ప్రచురణ :
ప్రజ్ఞా భారతి -
ఆంధ్రప్రదేశ్
3-4-705/4, నారాయణగుడా
హైదరాబాద్ - 500 027.

ప్రతులకు :
సాహిత్యనికేతన్
3-4-852; కేశవనిలయం
బరకత్‌పురా ; హైదరాబాద్ - 27
ఫోన్ : 7563236

సాహిత్యనికేతన్
ఏలూరు రోడ్
విజయవాడ - 2

వెల రూ. 10/ -

## ముందుమాట

క్రైస్తవ మిషనరీలు చేస్తున్న మతమార్పిడుల గురించి ప్రస్తుతం వివాదాన్ని దృష్టిలో పెట్టుకొని, మతమార్పిడులపై జాతీయ స్థాయి చర్చ జరగాలని పిలుపు నిచ్చిన ప్రధాన మంత్రి వాజ్‌పాయ్ ప్రకటనను అనుసరించి ప్రజ్ఞా భారతి ఆంధ్ర ప్రదేశ్ విభాగం 'మతాంతరీకరణలు - ఔచిత్యం' అనే అంశం మీద ఫిబ్రవరి 9, 1999న హైదరాబాద్‌లో ఒక చర్చ నిర్వహించారు. ఈ చర్చాగోష్ఠిలో పాల్గొన్న ప్రముఖ వక్తల్లో అమెరికన్ ఇన్స్‌ట్యూట్ ఆఫ్ వేదిక స్టడీస్ డైరక్టర్ గా పనిచేస్తున్న ప్రముఖ ఇండాలజిస్ట్ మరియు వేదాచార్యులైన డ్యాక్టర్ డేవిడ్ ఫ్రాలే మరియు హైదరాబాద్ ఆర్చిబిషప్ సామినేని అరులప్పలు ఉన్నారు.

ఈ సమావేశానికి ఆంధ్ర ప్రభుత్వ ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ సమాచార శాఖ సలహాదారుడు మరియు ప్రజ్ఞా భారతి, ఆంధ్రప్రదేశ్ శాఖ అధ్యక్షులైన శ్రీ టి . హెచ్ . చౌదరి అధ్యక్షత వహించారు. ఈ పుస్తకంలో వారి ఉపన్యాసాల పూర్తి పాఠాలలో పాటు, చర్చించిన అంశాలు కూడా ఉన్నాయి.

ఆంగ్లంలో సాగిన ఈ ప్రసంగాలను చక్కటి తెలుగులో అనువదించి ఇచ్చిన శ్రీ కేశవ నాథ్ గారికి మా ధన్యవాదములు.

ప్రకాశకులు

# దైవభక్తులుగా మారడమే నిజమైన మతాంతరీకరణ

– ఆర్చిబిషప్ సామినేని అరులప్ప

సోదర సోదరీమణులారా!

రాబోయే సంవత్సరాన్ని అంతర్జాతీయ శాంతి, సంస్కృతుల సంవత్సరంగా పరిగణించాలని ఐక్యరాజ్యసమితి సాధారణ సభ నిర్ణయించింది. సంస్కృతి, శాంతి అనేవి నైతిక, మానవతా విలువలపై ఆధారపడి ఉంటాయి.

భారతీయ జీవన విలువలలో ముఖ్యమైన సర్వధర్మ సమభావన వలన పరస్పర అవగాహన, సహనం పెంపొందుతాయి. మత మార్పిడి వంటి అంశాలను చర్చించడానికి ఇది చాలా అవసరం.

ప్రపంచంలో యుద్ధవాతావరణం తలెత్తకుండా తగిన పరిష్కార మార్గాలు అనుసరించాలని యునెస్కో ప్రయత్నిస్తున్నది. ఈ శతాబ్దంలో ఇప్పటికే మనం రెండు ప్రపంచయుద్ధాలను చూశాం. మూడవ ప్రపంచ యుద్ధపు ఛాయలు కూడా కనిపిస్తున్నాయి.

శాంతిని సాధించడం కేవలం ప్రభుత్వాల పని మాత్రమే కాదు. అలాగే శాంతి అంటే యుద్ధాలు, హింస లేకపోవడం మాత్రమే కాదు. శాంతి, సామరస్యాలు మనం అనుసరించే నైతిక విలువలపైన, మన ఆలోచనా విధానం పైన ఆధారపడి ఉంటాయి. కనుక ప్రజలకు సరైన ఆలోచనా విధానాన్ని, నైతిక జీవనాన్ని అలవాటు చేసే వ్యవస్థ ఉండాలి. ఈనాడు ప్రపంచం కుంచించుకుపోయింది. ప్రపంచంలో ఏ మూల ఏం జరిగినా అది మరుక్షణం అందరికీ తెలిసిపోతుంది.

ఆధ్యాత్మిక, నైతిక విలువలను వ్యాప్తి చేసే వ్యవస్థ అవసరం ఎంతైనా ఉంది. కాని దురదృష్టవశాత్తు అటువంటి వ్యవస్థ కనబడటం లేదు. ఆధ్యాత్మిక, నైతిక విలువలను ఎవరూ పట్టించుకోవడం లేదు.

విజ్ఞాన శాస్త్రం, మతం ఒక పక్షికి రెండు రెక్కల వంటివి. సమాజాభివృద్ధికి రెండూ అవసరమే. కాని మనం సాధారణంగా విజ్ఞాన శాస్త్రానికి కానీ, మతానికి కానీ ఎక్కువ ప్రాధాన్యత ఇస్తూ ఉంటాం. మిశ్రమ సంస్కృతి, విభిన్న వర్గాలతో కూడిన మన దేశంలో అన్ని మతాల పట్ల నిజమైన, సమానమైన గౌరవం ఏర్పడేట్లు చూడాలి. కేవలం ఆచారాలు, నమ్మకాల పట్ల కాకుండా ఆధ్యాత్మిక అంశాలపై మన దృష్టి సారిస్తే మనలో మతమౌఢ్యం తలెత్తదు.

ఇప్పటి వరకు ఆధ్యాత్మికతకి బదులు ఆచారాలు, నమ్మకాలకే అధిక ప్రాధాన్యత ఇస్తూ వచ్చాం. భగవంతుడు ఒక్కడే. ఆ భగవంతుని చేరడానికి ఒకొక్క మతం ఒకొక్క మార్గం. ప్రతి మతానికీ కొన్ని ప్రత్యేకతలు, అందరూ అనుసరించదగిన అంశాలు ఉంటాయి. ఏ మతంలోనైనా మంచిని గ్రహించడం నాకు అలవాటైంది.

భారత్‌లో ఒక మిశ్రమ సంస్కృతి ఉంది. సెక్యులరిజం మన రాజ్యాంగపు మౌలిక అంశాలలో ఒకటి. కానీ మనం 'సెక్యులరిజాన్ని' సరిగా అర్థం చేసుకోలేదు. సాధారణంగా దానికి రాజకీయ రంగు పులమడం జరుగుతూ ఉంటుంది.

జాతీయ సమైక్యతని పెంపొందించడానికి అందరూ కృషి చేయాలి. అనేక సంస్కృతులు, మతాలు, భాషలు ఉన్నా మనమంతా ఒకే జాతి. ఈ భావన అందరిలో కలిగించడానికి నైతిక సూత్రాలతో కూడిన ఆధ్యాత్మిక జీవన విధానం ఎంతైనా అవసరం.

మంచిని సాధించడానికి ఎటువంటి మార్గాన్నైనా అనుసరించవచ్చని అనుకోవడం పొరపాటు. మంచిని సాధించడానికి నైతికమైన, సరైన మార్గాలనే అనుసరించాలి.

పై విషయాలను దృష్టిలో పెట్టుకుని 'మతమార్పిడి' అనే అంశాన్ని గురించి చర్చిద్దాం.

ఈ విషయాన్ని రాజకీయం చేయడం వల్ల అనేక సమస్యలు కలుగుతున్నాయి. ప్రతి పౌరుడికి తన మతాన్ని అనుసరించడానికి, ప్రచారం చేయడానికి హక్కు ఉందని రాజ్యాంగంలోని 25వ అధికరణం పేర్కొంటోంది. వివిధ మతాలకు చెందినవారు ఒకచోట జీవించవచ్చును. భారత్ పుణ్యభూమి.

ఇలా వివిధమతాలకు సమానస్థానం ఉన్న దేశంలో బలవంతపు మత మార్పిడులు ఎలా సాధ్యమవుతాయి? నిజమైన మత మార్పిడి నిర్బంధం ద్వారా, ఆశచూపడం ద్వారా సాధ్యం కాదు. మతం నుండి మతానికి మారడం నిజమైన మార్పుకాదు. భగవంతుని భక్తుడిగా మారడమే నిజమైన మతాంతరీకరణ అవుతుంది. ఈ రోజు వివిధ ప్రాంతాలలో హింస, ద్వేషభావాలు ఎందుకు తలెత్తుతున్నాయో అర్థం కావడంలేదు. వీటి వెనుక రాజకీయ ప్రయోజనాలు పనిచేస్తున్నా యనిపిస్తోంది.

మత మార్పిడి వంటి విషయాలపై మతాధికారులు చర్చించి ఒక అవగాహనకు రావాలి. ఆ విధంగా వారు పరస్పర అవగాహన, సామరస్యాలను పెంపొందించాలి. ఇతరులు ఏం చెపుతున్నారన్నది కాకుండా స్వతంత్రంగా ఆలోచించగలిగిన మేధావులు కూడా ప్రముఖ పాత్ర వహిస్తారు.

మత సామరస్యం, సౌభ్రాతృత్వం, శాంతియుత జీవనం చాలా ముఖ్యమైనవి. భిన్నత్వంలో ఏకత్వం భారత్ ప్రత్యేకత. ఇది మరెక్కడా

కనిపించదు. పరస్పరం ఒకరి విశ్వాసాలను, మతాన్ని మరొకరు గౌరవిస్తూ సామరస్యపూర్వకంగా వ్యవహరించ లేకపోతే ఒక జాతిగా మనలేమని చరిత్ర తెలియజేస్తోంది. మన ప్రాచీన సంస్కృతీ వారసత్వాలను పరిరక్షించుకోవలసిన బాధ్యత మనందరిపైన ఉంది.

భిన్నత్వం కలిగిన సమాజంలో ఇతరుల వద్ద ఉన్న మంచిని గ్రహించే లక్షణం చాలా అవసరం. మన జాతికి ఇస్లాంలోని క్రమశిక్షణ, అనుశాసనం, హిందుత్వంలోని ఏకత్వం, విశాల భావన, సిక్కు, బౌద్ధ, జైన మతాలలోని ధైర్యం, అహింస, పార్శీ మతంలోని సృజనాత్మకత, క్రైస్తవంలోని త్యాగభావన అలవడాలని కోరుకోవడంలో తప్పులేదు. ఇవన్నీ ఆయా మతాల్లో ఉన్న విశిష్టమైన అంశాలు.

ఈనాడు తలెత్తిన హింస, ద్వేషాలను అంతం చేయాలంటే మనం మరొకసారి ప్రాచీన ఆధ్యాత్మిక వారసత్వాన్ని గుర్తు చేసుకోవాలి. వేదాలు, ఉపనిషత్తులలోని సత్యాలు అందరికీ వర్తిస్తాయి. అవి పరమ సత్యాలు. మన భాష భగవంతుని పూర్తిగా వర్ణించలేదు. కనుక భగవంతుడు ఎంత జ్ఞానం మనకు అందించాడు అనేది పరస్పర చర్చ వలన స్పష్టమవుతుంది. అలాగే వివిధ మతాలలో ఉన్న పోలికలు, సారూప్యత మనకి అర్థమవుతాయి.

నేటి భౌతికవాదం గత మూడు శతాబ్దాలుగా ప్రపంచంలో వ్యాపిస్తూ వచ్చింది. దీని మూలంగానే ఆయుధ పోటీ, ఆర్థిక సార్వభౌమత్వానికై పోటీ, లింగవివక్షత, పర్యావరణం సంక్షోభం వంటి సమస్యలు ఎన్నో ఎదురవుతున్నాయి. ఇవి మానవజాతి మనుగడకే ప్రమాదకరంగా పరిణమిస్తున్నాయి. ఈ పరిస్థితిని మార్చాలంటే మనం భౌతికవాదాన్ని వదలి ఆధ్యాత్మిక జీవన విధానాన్ని అలవరచుకోవాలి. విజ్ఞానశాస్త్రం, మతం, ఆధ్యాత్మికత, ఆచార వ్యవహారాల మధ్య సమన్వయాన్ని సాధించాలి. అంతిమ

సత్యం విజ్ఞాన శాస్త్రం, మతాలు రెండింటిలోనూ ఉంది. విజ్ఞానశాస్త్రపు పరధి పరిమితమైనది అయితే మతం పరిధి చాలా విశాలమైనది.

మతానికి సంబంధించిన విషయాలు అశాస్త్రీయమైనవి కావు. అవి కేవలం విజ్ఞాన శాస్త్రపు పరిధిలోకి రావు. విజ్ఞాన శాస్త్రం, మతాలను నీటిలో తేలుతున్న మంచు ఖండంతో పోల్చవచ్చును. విజ్ఞాన శాస్త్రం ఆ మంచు ఖండపు కొన అయితే మతం దాని అడుగుభాగం . అయితే అది పైకి కనబడదు. కనుక మతం, విజ్ఞానశాస్త్రం పరస్పర విరుద్ధమైనవి కావు.

భగవంతుడు అన్ని మతాలలో ఒక్కడే. ఈ విషయాన్ని మనం మరచిపోకూడదు. ప్రతి మతం ఆ భగవంతుని గురించి చెపుతుంది. మనం ఆ భగవంతునికి దగ్గరవుతున్నామా లేక సైతానుకి దగ్గరవుతున్నామా అనేది మన చర్యల వలన స్పష్టమవుతుంది. ప్రేమ, దయ, శాంతి, సచ్ఛీలత, ఆత్మ సంయమనం వంటివి భగవంతుని చేరే మార్గాలు.

"రామరాజ్యం అంటే కేవలం హింధువులకు సంబంధించినదని ఎవరూ పొరబడకూడదు. రాముడు అంటే భగవంతుడు. జీసస్ చెప్పిన భగవంతుని రాజ్యాన్ని, పుణ్యరాజ్యాన్ని నేను కోరుకుంటున్నాను" అని మహాత్మాగాంధీ అన్నారు.

నైతిక విలువలకు ప్రాధాన్యత నివ్వాలి. కొద్దిమంది మతఛాందసవాదులు సమాజంలోని సామరస్యపూర్వక వాతావరణానికి భంగం కలిగిస్తున్నారు. మనకి మన దేశంపై నిజమైన అభిమానం ఉన్నట్లైతే మనం ముందు భారతీయులమని, ఆ తరువాతనే వివిధ మతాలకు చెందినవారమని గుర్తించి వ్యవహరించాలి. మతాన్ని రాజకీయం చేయకూడదు. వివిధ మతాల మధ్య శాంతి, సామరస్యాలు నెలకొనేందుకు కృషిచేయాలి. వివాదాలను, రాజకీయ ప్రయోజనాలను ప్రక్కకు పెట్టాలి. అనుమానం, అవిశ్వాసం అనే అడ్డు గోడలను తొలగించి

సామరస్యం, పరస్పర అవగాహనలను పెంపొందిద్దాం.

రవీంద్రనాథ్ టాగూర్ వ్రాసిన ప్రార్ధనతో ముగిస్తాను : ''ఆ స్వతంత్ర స్వర్గసీమ, ఓ తండ్రీ, నాదేశంలో ఏర్పడాలి.

ఎక్కడైతే భీతి ఉండదో, ఎక్కడ సంకుచిత భావాలనే అడ్డుగోడలు ఉండవో ఆ ప్రపంచం ఏర్పడాలి.''

## మత మార్పిడి వ్యాపారం బహుళజాతి సంస్థల వ్యాపారం వంటిదే

**– డా॥ డేవిడ్ ఫ్రాలే**

తన ఉపన్యాసంలో అనేక విషయాలను తెలిపినందుకు ఆర్చిబిషప్‌కి ధన్యవాదాలు. ప్రస్తుతపు చర్చాంశాన్ని నేను మరొక కోణం నుండి ప్రస్తావిస్తాను. అమెరికా వంటి దేశాలలో సైతం వివిధ మతాల మధ్య విభేదాలు, సంఘర్షణ తలెత్తుతున్నాయి. కనుక ఇది కేవలం భారత్‌కి సంబంధించిన సమస్య మాత్రమే కాదు.

నేను చిన్నప్పటి నుండి కాథలిక్కు మతాన్ని అనుసరించాను. కాథలిక్ స్కూల్‌కి వెళ్ళి చదువుకున్నాను. మా మామయ్య మిషనరీగా పని చేసేవారు. ఇప్పటికీ పని చేస్తున్నారు కూడా. దక్షిణ అమెరికాలోని స్థానిక జాతుల వారిని రక్షించడానికి, వారిని నరకకూపం నుండి తప్పించడానికి తాను అక్కడికి వెళుతున్నానని ఆయన మాతో చెప్పేవారు. వారిని మతం మార్చకపోతే వారంతా నరకానికి పోతారని చెప్పేవారు.

నేడు ఎక్కడా 'సర్వధర్మ సమభావం' అనేది కనిపించదు. నేను పొందిన క్రైస్తవ విద్యలో అది ఎప్పుడూ నాకు కనిపించలేదు.

హిందుత్వం అంటే విగ్రహారాధన, మూఢ నమ్మకాలు, బహుదేవతారాధన అని, హిందువులకి స్వర్గంలో స్థానం లేనేలేదని మాకు చిన్నప్పటి నుండి చెప్పేవారు. మహాత్మగాంధీని కొంత వరకు అంగీకరించినా ఆయనకి కూడా పూర్తి గౌరవం ఎప్పుడూ ఇవ్వలేదు.

ఈ ధోరణి ఇప్పటికీ అలాగే ఉంది. ఇప్పటికీ హిందువులను మతం మార్చడానికి ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి.

ఇలా ఎందుకు జరుగుతోంది? అన్ని మతాలు ఒకే భగవంతుని గురించి చెప్తున్నాయని అంటున్నప్పుడు కొన్ని మతాలు ఇతర మతస్థులను మత మార్పిడి చేయడానికి ప్రయత్నించడం ఎందుకు?

హిందుత్వం భిన్నత్వంతో కూడిన సంప్రదాయం. భగవంతుని తెలుసుకోవడానికి, ఆత్మసాక్షాత్కారాన్ని పొందడానికి అనేక పంథాలు, మార్గాలు ఉన్నాయని, ప్రతివ్యక్తి తన ఇష్టానుసారం, తనకి అనుసరణీయమైనదిగా తోచిన మార్గాన్ని ఎన్నుకోవచ్చని హిందుత్వం చెప్తుంది.

కాని అన్ని మతాలు భిన్నత్వాన్ని అంగీకరించవు. నిజానికి చాలామటుకు మతాలు సంకుచితమైన ధోరణిని అవలంబిస్తాయి. ప్రపంచంలో రెండు పెద్దమతాలు తాము చెప్పేదే సత్యమని, తమదే నిజమైన మతమని చెప్తాయి. క్రైస్తవులు మాత్రమే మోక్షానికి అర్హులని సాధారణ క్రైస్తవులకి బోధించబడుతోంది. క్రైస్తవులందరికీ స్వర్గం, క్రైస్తవేతరులందరికీ నరకం అని నిర్ణయిస్తున్నారు. ఇప్పటి వరకు ఏ క్రైస్తవ మతాధికారి ఈ వాదనని ఖండించలేదు.

అలాగే ఇప్పటి వరకు ఏ ముస్లిం మతాధికారి కానీ, క్రైస్తవ మతాధికారి కానీ హిందుత్వం కూడా ఇస్లాం, క్రైస్తవాలవంటిదేనని అంగీకరించలేదు. అలా ప్రకటించలేదు. రాముడు, కృష్ణుడు జీసస్‌తో సమానమని ఏ పాశ్చాత్య క్రైస్తవ మతాధికారి అంగీకరించలేదు. రమణ మహర్షిని, అరవిందయోగిని భగవత్సాక్షాత్కారం పొందిన యోగులని గుర్తించడానికి వీరు అంగీకరించక పోవచ్చును. ఇదే వాటికన్ అనుసరించే ధోరణి.

ఆసియాలో పరిస్థితిని గురించి వివరిస్తూ పోప్ విడుదల చేసిన 'రాబోయే నూతన సహస్రాబ్ది' అనే ప్రకటనలో ఇలా పేర్కొన్నారు : "ఆసియాలో పనిచేసేవారు ప్రాచీన మతాలైన బౌద్ధం, హిందుత్వాలను ఎదుర్కొనవలసి వస్తుంది. ఈ మతాలలోని సత్యాన్ని అంగీకరిస్తూనే క్రీస్తు మాత్రమే మానవాళిని రక్షించగలడని, ఆయనే నిజమైన ప్రవక్త అని చర్చి ఎప్పుడూ తెలియజేస్తూ ఉండాలి."

నేను యధాతథంగా ఉటంకించాను. దీనిని బట్టి మతసహనానికి అర్థం ఏమిటి? క్రీస్తు మాత్రమే మార్గం. ఒక ప్రక్క అన్ని మతాలలోని సత్యాన్ని అంగీకరిస్తామని అంటూనే మరో ప్రక్క ఆయా మతాలు క్రీస్తుని అంగీకరించకపోతే వాటిని గుర్తించమని అంటున్నారు. ఇతర మతస్థులకు మతం మార్చేపని అలాగే ఉన్నదన్నమాట. ఇదీ పోప్ సందేశం. ఇది పరమత సహనం ఎంతమాత్రం కాదు. అలాగే హిందువులు వారి మార్గాన్ని అనుసరించవచ్చునని, క్రైస్తవులు తమ మార్గం అనుసరించవచ్చునని, ఈ రెండుమార్గాలు సరైనవేననే ధోరణి కూడా ఈ సందేశంలో ఎక్కడా కనిపించదు. బుద్ధుడిని, కృష్ణుడిని, జీసస్ తో సమానమని అంగీకరించే విశాలదృష్టి కనిపించదు.

ఇటువంటి సంకుచిత ధోరణి వలన అసహనం పెరుగుతుంది. నేను అనుసరించే మార్గమే సరైనదని అనుకుంటున్నప్పుడు నేను మరొక మార్గాన్ని

ఎలా అంగీకరించగలుగుతాను? ఇలా అంగీకరించలేక పోవడం వల్ల ఇతరులతో ఘర్షణ, విభేదాలు మొదలైనవి తప్పవు. కనుక ఇప్పటికీ ఇదే ధోరణి కొనసాగుతోందని, మత మార్పిడి ప్రయత్నాలు ఏ మాత్రం తగ్గలేదని హిందువులు గ్రహించగలగాలి.

సామాజిక పరమైన సైద్ధాంతిక పరమైన మత విషయాలన్నింటిపైన స్నేహపూర్వకమైన, స్వేచ్ఛతో కూడిన చర్చ జరగాలి. విజ్ఞాన శాస్త్ర విషయాలను చర్చించడంలో అనుసరించే ఖచ్చితమైన, నిర్మోహమాట వైఖరినే ఇక్కడ కూడా అనుసరించాలి.

మత మార్పిడిలో కొన్ని వర్గాలను లక్ష్యంగా ఎన్నుకుంటుంటారు. తమంత తాముగా ఎవరైనా ఏ మతాన్నైనా అనుసరించడానికి, ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్న మిషనరీ కార్యకలాపాలకి ఎంతో తేడా ఉంది. తమంత తాముగా, ఇతర మతాన్ని గురించి తెలుసుకుని, చర్చించి, ఆ మతాన్ని స్వీకరించాలని భావిస్తే అందులో తప్పులేదు.

ప్రపంచ వ్యాప్తంగా మిషనరీలు సాగిస్తున్నది ప్రపంచంలోనే అతి పెద్ద వ్యాపారం. కాథలిక్ చర్చి మాత్రమేకాక అనేక ప్రొటెస్టెంట్ సంస్థలు కూడా బిలియన్ల డాలర్లు ఖర్చుచేసి క్రైస్తవేతరులను క్రైస్తవ మతంలోకి మార్చడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆ సంస్థలు ఇందుకు అనేక వేల మందికి శిక్షణ ఇచ్చి, అనేక రకాల మతమార్పిడి పద్ధతులను రూపొందిస్తున్నాయి.

ఈ విధంగా సాగే బహుళజాతి మతమార్పిడి వ్యాపారం ఇతర బహుళజాతి కంపెనీల వ్యాపారం లాంటిదే. ఇందులో న్యాయపరమైనది, అంగీకరించదగినది ఏదీ లేదు. ఇది పరస్పరచర్చ, భావవినిమయాల మీద ఆధారపడినది అనుకుంటే పొరపాటే.

ఒక మతస్థులు ఇతర మతాలకు చెందినవారిని తమ మతంలోకి

మార్చుకోవడానికి అనుసరిస్తున్న ఖచ్చితమైన పథకమే ఈ మిషనరీ వ్యాపారం. దీనికి, మత స్వేచ్ఛకి సంబంధంలేదు. ఇది ఒకమతం ఇతర మతాలపై ఆధిపత్యం సంపాదించడానికి చేస్తున్న ప్రయత్నం మాత్రమే. ఇతర మతాలను దూషించడం ద్వారా, అవమానించడం ద్వారా ఆ మతస్థులు తమ మతాన్ని వదిలి పెట్టేట్లు చేయడమే మిషనరీ వ్యాపారపు లక్ష్యం. ఈ మతమార్పిడి వ్యవహారం భారత్‌లో పెద్దఎత్తున సాగుతుండడానికి కారణం ఏమిటి? భారత్ అతి పెద్ద క్రైస్తవేతర దేశం అలాగే ఇక్కడ మతప్రచారానికి పూర్తిస్వేచ్ఛ ఉంది. పాకిస్థాన్, బంగ్లాదేశ్ వంటి ముస్లిం దేశాలు మిషనరీ కార్యకలాపాల్ని ఏ మాత్రం ఒప్పుకోవు. సౌదీ అరేబియాలోకి బైబిల్‌ని కాని, ఏసుబొమ్మకానీ తీసుకువెళ్ళడానికి వీలులేదు. చైనాకూడా మిషనరీ కార్యకలాపాల్ని ఒప్పుకోదు.

భారత్ అనుసరించే విశాల, సహనశీల దృక్పథాన్ని ఆసరాగా చేసుకుని మిషనరీలు తమ కార్యకలాపాల్ని సాగిస్తున్నారు. ఈ మధ్య ఒక మిషనరీ హత్యకి గురయ్యాడు. ఇది దురదృష్టకరమైన సంఘటన. హింస ఎప్పుడూ మంచిది కాదు. అదే సమయంలో ఇండోనేషియాలో 50మంది క్రైస్తవులను ముస్లిములు హతమార్చారు. ఇలా మతపరమైన హింస ప్రపంచ వ్యాప్తంగా పెరుగుతోంది.

అనేక శతాబ్దాలుగా భారత్‌లో మతం పేరున అనేక మంది హిందువులు హత్యకి గురయ్యారు. ఈ మధ్య కాలంలో కాశ్మీర్‌లో పెద్ద సంఖ్యలో హిందువులు హతమార్చబడ్డారు. కానీ ఈ వార్తలేవీ విదేశీపత్రికలలో చోటుచేసుకోవు. భారత్‌లో ఒక్క విదేశీ మిషనరీ చంపబడితే మాత్రం పాశ్చాత్యదేశాలన్నీ గగ్గోలు పెట్టాయి. ఆంక్షలు విధిస్తామని బెదిరించాయి. మిషనరీల కార్యకలాపాలను సమర్థించాయి.

ప్రపంచ వ్యాప్తంగా మిషనరీ కార్యకలాపాల వల్ల ఎంతో జననష్టం, రక్తపాతం జరిగింది. ఆ వివరాలన్నీ నేను ఇక్కడ ప్రస్తావించను. భారత్‌లోని

గోవాలో ఇంక్విజిషన్ కార్యకలాపాలు జరుగుతూ ఉండేవి. బ్రిటిష్ పాలకులు కూడా రహస్యంగా మిషనరీలకు కావలసిన సహాయసహకారాలు అందిస్తూ ఉండేవారు. అనేక ఇతర దేశాల్లో కూడా సామ్రాజ్యవాద శక్తులు మిషనరీ కార్యకలాపాలకి అండగా ఉండేవి.

మిషనరీలు సృష్టించిన మారణకాండని, వారికి బ్రిటిష్ పాలకులు అందించిన సహాయాన్ని మరచిపోవాలని ఈనాడు అంటున్నారు. కాని అది అంత త్వరగా మరచిపోలేము. ఎందుకంటే బ్రిటిష్ పాలన అంతమయి ఒక తరం కాలం మాత్రమే గడిచింది. అంతేకాదు! ఆ మారణకాండకి పాల్పడిన మిషనరీలు ఇప్పటివరకు ఎప్పుడూ తమ చర్యలకి క్షమాపణ చెప్పుకోలేదు, పశ్చాత్తాపం ప్రకటించలేదు. 1947 కి ముందు, 19వ శతాబ్దములో, గోవాలో, అమెరికాలో తాము సాగించిన కార్యకలాపాలు హింసకి, మారణకాండకి దారితీశాయని మిషనరీలు ఒప్పుకుంటున్నట్లయితే వాళ్ళలో ఎవరూ ఇప్పటి వరకు తమ కార్యకలాపాలకు క్షమాపణ ఎందుకని చెప్పలేదు?

## మతమార్పిడి కార్యకలాపాలు ఎందుకు? వీటి లక్ష్యం, ఉద్దేశ్యం ఏమిటి?

క్రైస్తవం మాత్రమే నిజమైన మతమని, క్రీస్తు మాత్రమే మానవాళిని ఉద్ధరిస్తాడని, క్రైస్తవులు స్వర్గానికి వెళితే, క్రైస్తవేతరులంతా నరకానికి పోతారని నమ్ముతున్నారు. ఇలాంటి విశ్వాసాలవల్ల ఘర్షణ, అసహన ధోరణి పెరుగుతాయి కానీ సహనం, సామరస్యం పెంపొందవు.

ఇలాంటి ధోరణి కలిగిన వాళ్ళు సమాజంలో మత మార్పిడికి

పాల్పడినప్పుడు ఏం జరుగుతుంది? ప్రజలంతా తమ పూర్వాజుల్ని, తమ సంస్కృతీ సంప్రదాయల్ని మరచిపోవాలని ప్రచారంచేస్తారు. కుటుంబాలు విచ్చిన్నం అవుతాయి. ఎక్కడ మిషనరీ కార్యకలాపాలు జరుగుతాయో అక్కడ వేర్పాటువాద ధోరణి, ఘర్షణ తలెత్తుతాయి.

క్రైస్తవ మతంలో అనేక రకాల సంప్రదాయాలు ఉన్నాయి. అనేక రకాల మిషనరీ కార్యకలాపాలు సాగుతున్నాయి. కొన్ని క్రైస్తవ వర్గాలు ఎలాంటి మిషనరీ కార్యకలాపాలు చేపట్టడం లేదు. ఉదాహరణకి గ్రీకు సంప్రదాయక్రైస్తవం, సిరియా క్రైస్తవం అత్యంత సహనశీలమైన, ప్రాచీనమైన సంప్రదాయాలు. కాథలిక్ సంప్రదాయానికి చెందిన క్రైస్తవం ప్రపంచ వ్యాప్తంగా మిషనరీ కార్యకలాపాలు సాగిస్తోంది. పాశ్చాత్య సామ్రాజ్యవాదం బలంగా ఉన్నప్పుడు ప్రభుత్వబలాన్ని ఉపయోగించి మతమార్పిడిలు సాగిస్తే ఇప్పుడు నిశ్శబ్దంగా అదే పని చేస్తోంది. ప్రొటెస్టెంటులు, ఆంగ్లికన్లు, లుథరెన్‌లు కూడా మిషనరీ కార్యకలాపాలు సాగిస్తున్నారు.

వీటన్నింటికంటే మించి ఈనాడు అమెరికా నుండి వచ్చిన మత ప్రచారకులు తమ కార్యకలాపాల్ని బాగా విస్తరింపజేస్తున్నారు. ది వరల్డ్ విజన్ అనే పేరుతో మార్‌మాన్‌లు, బాప్టిస్ట్‌లు ఇలా అనేక వర్గాల వారు కలిసి పని చేస్తున్నారు. వీరు భారత్‌లో మతమార్పిడులు సాగించటానికి అమెరికాలో నిధులు సేకరిస్తున్నారు. అమెరికాలో టి.వి. ఛానళ్ళ ద్వారా ఇందుకు ప్రయత్నిస్తున్నారు.

వీరి ప్రధాన నాయకుల్లో ఒకరైన పాట్ రాబర్ట్‌సన్ హిందుత్వం ఒక పైశాచిక మతం అని అన్నాడు. జంతువుల ముఖాలు కలిగిన హిందూ దేవతల్ని చూపించి ''చూడండి! హిందువులు ఎంత అనాగరికులో!'' అని ప్రచారం చేస్తున్నారు. భారత్‌లోని రాజకీయ, సామాజిక సమస్యలన్నిటికీ హిందుత్వమే

కారణమని చూపి "ఇలాంటి భయంకరమైన మతం నుండి ప్రజలను కాపాడి వారిని మతం మార్చడానికి మేము భారత్ వెళుతున్నాం. కనుక మీరు ధనసహాయం చేయండి" అని నిధులు సేకరిస్తున్నారు.

వీళ్ళే ప్రపంచంలోని మిగతా దేశాలకు కూడా వెళ్ళి అక్కడి కాథలిక్ క్రైస్తవుల్ని సైతం మతం మార్చాలని ప్రయత్నిస్తున్నారు. ఈమధ్య బ్రెజిల్‌లో పర్యటించిన పోప్ వీరి కార్యకలాపాలను తెలుసుకున్న తరువాత వీరిని "తన మేకల మందని" ఎత్తుకుపోతున్న "తోడేళ్ళ"ని అన్నారు.

ఈ మిషనరీలు ఒకప్పుడు కాథలిక్కులు అనుసరించిన హిందుత్వ వ్యతిరేక ధోరణిని అవలంబిస్తున్నారు. అందువల్ల ప్రపంచమంతటా మత సామరస్యం నెలకొంటున్నదని, హిందుత్వాన్ని ఇతర మతాలు గౌరవిస్తాయని అనుకోవడం వట్టి భ్రమ మాత్రమే.

నిజానికి అమెరికాలో పాఠ్యపుస్తకాలలో కూడా హిందుత్వం ఒక మతం కానేకాదని ప్రచారం చేస్తున్నారు. ఎందుకంటే హిందుత్వంలో ఒకే దేవుడు, ఒకే మతగ్రంథం లేవని, హిందుత్వం ప్రపంచాన్ని గెలవడానికి మిషనరీలను పంపడంలేదని కనుక అది మతం కాదని వారి వాదన.

కేవలం మత మార్పిడిని కాక ఈ మిషనరీ కార్యకలాపాలన్నింటిని వ్యతిరేకించాలి. అంతేకాని వాటిని పట్టించుకోకుండా మౌనంగా ఉండిపోకూడదు. సమాజోద్ధరణ, సేవ పేరున కూడా ఈ మతమార్పిడి జరుగుతోంది. ఇవి రెండూ ముఖ్యమైనవే కాని వీటి ద్వారా మతమార్పిడికి పాల్పడకూడదు. ఒక దేశానికి ఆర్థికంగా సహాయం చేయాలనుకుంటే నిరభ్యంతరంగా చేయవచ్చును. కానీ అక్కడ మత ప్రస్తావన అవసరం లేదు. ఏ పని చేసినా ఏసు బొమ్మ పెట్టి చేస్తున్నపుడు అక్కడ మతమార్పిడి ప్రధాన లక్ష్యం అవుతుంది.

ప్రపంచంలోని ఏ దేశం మతమార్పిడుల మూలంగా ఆర్థికంగా అభివృద్ధి సాధించలేదు. జపాన్ కానీ, అమెరికా కానీ ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ఆర్థికపరమైన విధానాలు ఉపకరించాయి కాని మతం మాత్రం కాదు. ప్రపంచంలోని అతి పేద దేశాల్లో క్రైస్తవ దేశాలు కూడా ఉన్నాయి. ఫిలిప్పీన్స్ ఆసియాలో అతి ప్రాచీనమైన కాథలిక్ దేశం. కానీ ఆసియాలో అది అతి పెద్ద దేశాల్లో ఒకటి.

ప్రపంచంలో ఎక్కువ మంది కాథలిక్కులు మధ్య, దక్షిణ ఆసియాల్లో ఉన్నారు. వీరు ఉత్తర అమెరికా, యూరప్‌లలోని కాథలిక్కుల కన్నా చాలా ఖచ్చితంగా మతాన్ని అవలంబిస్తారు. అయినా అక్కడ సామాజిక అసమానతలు, పేద, ధనిక వర్గాల మధ్య అంతరాలు ఎక్కువగా ఉన్నాయి. అక్కడి కాథలిక్కు మతగురువులు ఏనాడు ఈ అసమానతలను, అంతరాలను తొలగించేందుకు పేదవారంతా ఇతర మతాలను పుచ్చుకోవాలని చెప్పలేదు. తమ మతం ద్వారానే ఈ అసమానతలు తొలగించడానికి ప్రయత్నిస్తున్నారు.

కనుక 'మతం ఆధారంగా పేదరికాన్ని తొలగిస్తాం' అని హిందు సమాజం మీద మిషనరీలు సాగిస్తున్నదాడి కేవలం మతమార్పిడి లక్ష్యంగా జరుగుతోందని స్పష్టమవుతుంది.

ఆస్పత్రులు, అనాధశరణాలయాలు, పాఠశాలల విషయానికి వస్తే, ఇవి ప్రజలకి ఉపయోగపడతాయి. కానీ వీటి నిర్వహణలో కూడా మత ప్రస్తావన ఎందుకు తెస్తున్నారు? మీ 2000 సంవత్సరాల మతమార్పిడి కార్యకలాపాల చరిత్ర తెలిసిన ఎవరైనా ఏసు బొమ్మ పెట్టి మీరు సాగిస్తున్న కార్యక్రమాలలో ఎలాంటి దురుద్దేశం లేదని ఎలా నమ్మగలరు ? అది మతమార్పిడుల కోసం కాదని ఎలా అనుకోగలరు? ఇది నిస్వార్థసేవ అని ఎలా అంగీకరించగలరు?

మనం భగవంతుడిని ప్రేమిస్తే, సాటి వారిని ఆదరిస్తే వారి మతం ఏదని పరిగణించం. వారి మతాన్ని కూడా ఆదరిస్తాం. వారిని మతం మార్చాలని అనుకోం. నిజానికి వారి మతాన్ని గురించి ఆలోచించం. భగవంతుని పట్ల నిజమైన భక్తి, ప్రేమ ఇతరులను మతం మార్చడంలో ఉండదు.

భారత్‌కి చెందిన స్వామి రామతీర్థ ఒకసారి అమెరికా వచ్చినప్పుడు కొందరు ఆయన్ని మీ మతం ఏదని అడిగారు. అందుకు ఆయన ''మనం ఏ మతానికీ చెందినవారం కాదు. అన్ని మతాలు మనవే'' అని సమాధానం ఇచ్చారు.

వ్యక్తులు చర్చి ఆస్తి కాదు. ఆత్మని ఎవరూ రక్షించవలసిన అవసరం లేదు. అది శాశ్వతమైనది. మనం మనలోని దైవత్వాన్ని తెలుసుకోవాలి. ఏ వ్యక్తి స్వభావాన్ని మనం మార్చలేం. హిందుత్వం ప్రతి వ్యక్తి స్వభావాన్ని, అతని స్వధర్మాన్ని అంగీకరించి, గౌరవిస్తుంది. అనేక మతాలు, పంథాలు ఉండవచ్చును. మానవాళికంతటికీ ఒకే మతం ఉండాలని అనడం అందరికీ ఒక జత బట్టలే ఉండాలనడం లాంటింది. ప్రజలంతా ఒకే రకం ఆహారం తిని, ఒకే తరహా ఉద్యోగం చేయాలని అనడంలా ఉంటుంది. భిన్నత్వం, స్వేచ్ఛ అనేవి మత విశ్వాసాల విషయంలో చాలా అవసరం.

దురదృష్టవశాత్తు అన్ని మతాల లక్ష్యం ఒకటి కాదు. ఒక్కొక్క మతానికి ఒక్కొక్క లక్ష్యం ఉంది. అన్ని మతాలు భగవంతుని అంగీకరించవు. బౌద్ధ, జైన మతాలు భగవంతుని సృష్టిని ఒప్పుకోవు. కొన్ని మతాలలో బహుదేవతారాధన ఉంది. ఏకేశ్వరోపాసన ఒక్కటే సరైన మతం, లేదా నిజమైన ఆరాధనా పద్ధతి కాదు. అన్ని రకాల ఆరాధనా పద్ధతులకి వాటి వాటి లక్ష్యం, విలువ ఉన్నాయి. హిందుత్వం ఏకేశ్వరోపాసనని, బహుదేవతారాధనని, ఆఖరికి నాస్తికవాదాన్ని కూడా అంగీకరించింది. ప్రజలకి తమకి నచ్చని మతాన్ని తిరస్కరించే స్వేచ్ఛ ఉండాలి.

హిందుత్వం సాధనకి ప్రాముఖ్యతనిస్తుంది. ఆధ్యాత్మిక సాధన ద్వారా ఆత్మ సాక్షాత్కారాన్ని సాధించాలని పేర్కొంటుంది. చాలామటుకు క్రైస్తవ సంప్రదాయాలు, ముఖ్యంగా ప్రొటెస్టెంట్ సాంప్రదాయం విశ్వాసం కలిగి ఉంటేచాలు, అది రక్షిస్తుందని అంటాయి. దీని అర్థం ఒక వ్యక్తి ఎన్ని హత్యలు చేసినా మరణించేప్పుడు అతను క్రైస్తవ మతం పుచ్చుకుంటే చాలు అతను తిన్నగా స్వర్గానికి వెళతాడు. మరొక వ్యక్తి జీవితాంతం ఎంత నియమనిష్టలతో, నిజాయితీగా బ్రతికినా అతను క్రైస్తవ మతాన్ని అంగీకరించకపోతే నరకానికి పోవడం ఖాయం.

ఈ మధ్య అమెరికాలో ఒక హత్య చేసిన స్త్రీకి మరణశిక్ష విధించబడింది. ఆ మహిళ ఆ తరువాత క్రైస్తవ మతాన్ని స్వీకరించింది. దానితో అక్కడి క్రైస్తవ మతాధికారులు క్రైస్తవ మతం స్వీకరించడం వల్ల ఆమె పాపం తొలగిపోయిందని, ఆమె శిక్షరద్దు చేయాలని వాదించారు. ఈ మతాధికారులే ఒకవేళ ఆమె క్రైస్తవ మతం కాకుండా మరొక మతాన్ని స్వీకరించి ఉంటే ఇలా వాదించి ఉండేవారు కాదు.

హిందుత్వం పట్ల ఎంతో దుష్ప్రచారం సాగుతోంది. గత సంవత్సరం న్యూయార్క్ టైమ్స్‌లో భారత్‌లో జరిగే అమర్‌నాథ్ యాత్ర గురించి ఒక వ్యాసం ప్రచురింపబడింది. అందులో ''హిందువులు విధ్వంసకారుడైన శివుని లైంగిక అవయవాలను పూజించడానికి ఈ యాత్ర చేస్తారు'' అని వ్రాయబడింది. దీనిని సహనశీలత అని అనగలమా ? ఈ ప్రచారపు లక్ష్యం ఏమిటి?

ఇలాంటి ప్రచారం సాగుతుండడానికి కారణం పాశ్చాత్య ప్రజానీకం కాదు. హిందువులు తమ మతాన్ని గురించి సరిగా ప్రచారం చేయకపోవడం వల్ల, తమ మతంపై జరుగుతున్న దుష్ప్రచారాన్ని అడ్డుకోకపోవడం వల్ల ఇది కొనసాగుతోంది. తమ మతాన్ని గురించి తామే సరిగా తెలుసుకోకపోవడం

వల్ల చాలామంది హిందువులు ఏ సమాధానం చెప్పలేరు. అలాగే ఇతర మతాల గురించి కూడా వీరికి సరిగా తెలియదు. ఇతర మతాలన్నీ హిందుత్వం లాంటివేనని చాలామంది అనుకుంటారు. కానీ యోగ, ధ్యానం, వేదాలు, వేదాంతం మొదలైనవి మరే సంప్రదాయంలోనూ లేవు.

వాటిని ప్రొటెస్టెంట్, ఇతర క్రైస్తవ సంప్రదాయాలు పూర్తిగా తిరస్కరించాయి. అవి పైశాచికమైనవని ప్రచారం చేశాయి.

అన్ని మతాలు ఒకే విషయాన్ని చెపుతాయని కొందరు అంటారు. హిందుత్వంలో కర్మ సిద్ధాంతం, పునర్జన్మ పట్ల విశ్వాసం ఉన్నాయి. కానీ క్రైస్తవం, ఇస్లాం ఈ రెండింటినీ అంగీకరించవు. అయితే ఇవి పైపై తేడాలని, ముఖ్యమైన విషయాలలో తేడా లేదని అంటారు. కానీ కర్మ సిద్ధాంతం, పునర్జన్మలో విశ్వాసం ముఖ్యమైనవి కావని అనగలమా?

అహింస, శాంతి సామరస్యాలు, నిజాయితీ వంటివి అందరికీ ఉండాలి. కాని క్రైస్తవంలో నేను గమనించిన లోపం జంతువులలో ఆత్మ లేదని, కేవలం మానవులే మోక్షానికి అర్హులని పేర్కొనడం.

దీని మూలంగానే ఈ రోజున ప్రకృతి శోషణకి పాల్పడుతున్నాం. ఈ ధోరణిని మార్చుకోవాలి. నిజమైన మతం రూపానికి, పేరుకి ప్రాముఖ్యత నివ్వదు. సనాతనమైన, శాశ్వతమైన సత్యాన్ని గురించి చెపుతుంది.

ఆత్మసాక్షాత్కారం హిందూమతపు ప్రధాన లక్ష్యం. మానవాళి ఎదుర్కొంటున్న సమస్య తమని తాము తెలుసుకోకపోవడమే. కొన్ని మూఢవిశ్వాసాల్ని ఏర్పరుచుకుని వాటినే అందరూ అంగీకరించాలని అంటాం.

కనుక పరస్పర చర్చలు ఎంతో అవసరం. విజ్ఞానశాస్త్ర విషయాలను చర్చించినట్లుగానే మత విషయాలను చర్చించాలి. ముందుగా ఈ మిషనరీ కార్యకలాపాలకి స్వస్తి చెప్పాలి. మిషనరీ కార్యకలాపాలు సహనశీలత,

మతస్వేచ్ఛలకి సంబంధించినవి కావు. ఇవి ఒక మతపు ఆధిపత్యానికి సంబంధించినవి. వీటిలో సెక్యులరిజం లేదు. మిషనరీలు తమ మతమే నిజమైనదని అంటారు.

ఈ కార్యకలాపాల్ని హింస ద్వారా, అసహన ధోరణి ద్వారా ఎదుర్కోవాలని ప్రయత్నించకూడదు. వాటి స్వభావాన్ని తెలుసుకోవడం ద్వారా ఎదుర్కోవచ్చును. పరస్పర చర్చ ద్వారా వీటిని అర్థం చేసుకోవాలి.

దీనితోపాటు హిందూ సమాజాన్ని, సంస్కృతిని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్న శక్తుల గురించి తెలుసుకోవాలి. భారత్ హిందుత్వాన్ని వదలి క్రైస్తవాన్ని, ఇస్లాంని స్వీకరిస్తే అది ఎంతో నష్టం. భారత్ అనేక ఆధ్యాత్మిక సంప్రదాయాలకి నిలయం.

పాశ్చాత్యులు ఈ దేశానికి ఎందుకు వస్తున్నారు ? ఈ ఆధ్యాత్మిక సంపదకి ఆకర్షితులై వస్తున్నారు.

''మీరు అనేక మందికి శిక్షణ ఇచ్చి, డబ్బు అందిస్తున్నారు. దేని కోసం? నా దేశానికి వచ్చి నా పూర్వజుల్ని, నా మతాన్ని, నాదేశానికి సంబంధించిన ప్రతిదాన్ని విమర్శించడానికి, దూషించడానికి. నా దేశానికి వచ్చి దేవాలయాలకు వెళ్ళి ఓ విగ్రహారాధకులారా! మీరు నరకానికి పోతారు అని అంటారు. ఇతరులను దూషించడంలో, విమర్శించడంలో వారికి శిక్షణ ఇస్తారు. అదే నేను ఏ మాత్రం మిమ్మల్ని విమర్శించినా గగ్గోలుపెడతారు. మా గురించి మాట్లాడకండి. మేము ఎవరినైనా విమర్శించవచ్చును, దూషించవచ్చును కానీ మమ్మల్ని మాత్రం ఎవరూ ఏదీ అనరాదు. మేము చాలా సున్నిత మనస్తత్వం కలవారం అంటారు.''

– స్వామి వివేకానంద

# క్రైస్తవం గతంలో అనేక తీవ్ర తప్పిదాలు చేసింది

- చర్చాగోష్ఠిలో ఆర్చిబిషప్ అరులప్ప



సభికుల నుండి వచ్చిన ప్రశ్నలన్నీ నన్ను ఉద్దేశించినవే. అన్ని ప్రశ్నలలో అతి చిన్న ప్రశ్నకి ముందు సమాధానం ఇస్తాను. ఇది చిన్న ప్రశ్నేకాని సమాధానం ఇవ్వడం కష్టం. అయినా ప్రయత్నిస్తాను.



★ డా. ఫ్రాలే లేవనెత్తిన అంశాలకి సమాధానం ఇవ్వండి ?

అరులప్ప: డా. ఫ్రాలేకి సమాధానం ఇవ్వడం, వాదించడం నా ఉద్దేశ్యం కాదు. నా దృష్టిలో క్రైస్తవం అంటే ఏమిటి, అది ఎలా ఉండాలి అనే అంశాలను మీ ముందు ఉంచాను. ఇక్కడ రెండు విషయాలు చెప్పదలుచుకున్నాను. ఒకటి, జీసస్ మానవునిగా ఈ భూమి మీద అవతరించాడన్నది విశ్వాసానికి సంబంధించిన విషయం. దీనిలో ఎలాంటి వాదోపవాదాలకు తావులేదు. అది మీరు ఒప్పుకోవచ్చును లేదా ఒప్పుకోకపోవచ్చును. విశ్వాసం అనేది భగవంతుడు ఇచ్చే వరం అని, అది అందరికీ లభించదని మేము అనుకుంటాము. మోక్షం అనేది మతం ద్వారా రాదు. అది భగవంతుని ద్వారా వస్తుంది. ఆ భగవంతునికి ఏ పేరైనా పెట్టుకోవచ్చును. ఈ విషయాన్ని అర్థం చేసుకుంటే ఇప్పుడు చర్చించిన ప్రశ్నలన్నింటికి సమాధానం లభిస్తుంది. భగవంతుడు ఒక్కడే. ఆయనని తెలుసుకునే మార్గాలు వేరు వేరు ఉండవచ్చును. ఇక రెండవ విషయం. నేను కూడా వేదాంతాన్ని అధ్యయనం చేశాను. అది చాలా అద్భుతమైన తత్వజ్ఞానం. అయితే ఒక విషయం చెప్పడానికి,

దానిని ఆచరణలో పెట్టడానికి ఎంతో తేడా ఉంటుంది. మత మార్పిడికై విరాళాలు ఇస్తున్న క్రైస్తవులలో ఎంతమంది నిజంగా క్రైస్తవ మతాన్ని ఆచరిస్తున్నారు? వాళ్ళలో ఎంత మంది చర్చికి వెళుతున్నారు? వారిలో నాస్తిక వాదులు లేరా? అలాంటి వారిని క్రైస్తవులని అనగలమా? వారు కేవలం పేరుకే క్రైస్తవులు. అందుకనే నేను నా ఉపన్యాసంలో కూడా మతం మార్పిడి అర్థంలేదని చెప్పాను.

మనం మనని ఉద్ధరించుకునే ప్రయత్నం చేయకుండా ఇతరులను ఉద్ధరించే ప్రయత్నం చేస్తున్నాం. భగవంతుడు ఏం చెపుతున్నాడన్నది తెలుసుకోకుండా ఇతరులను మతం మార్చాలనుకోవడంలో అర్థం లేదు. భగవంతుని ఇచ్ఛని, ఆయన వాణిని అనుసరించడమే నిజమైన మతం. ఎంత మంది నిజమైన మతాన్ని అవలంబిస్తున్నారు అన్నదే ప్రశ్న.

నాకు వ్యక్తిగతంగా మతమార్పిడిలో నమ్మకం లేదు. మన సంస్కృతిని గౌరవిస్తూ, ఇతరులను విమర్శించకుండా, సంస్కృతిలోని మంచిని గ్రహించి దానిని ఆచరించాలి. అటువంటి మతం మనకి కావాలి. ఇటువంటి చర్చాగోష్ఠుల వల్ల ఒక మతం వారికి మరొక మతంపట్ల ఉన్న భ్రమలు, భయాలు తొలగిపోయే అవకాశం ఉంటుంది.

చివరగా నేను ఒక విషయం చెప్పదలచాను క్రైస్తవం గతంలో అనేక తీవ్ర తప్పిదాలను చేసింది. అవి తీవ్రమైనవేకాని ఘోరాతిఘోరమైనవి కావు. వాటిలో ఒకటి మత విశ్వాసాలను, సంస్కృతిని కలపడం. భారత్‌లో భారతీయ సంస్కృతి, ఆఫ్రికాలో ఆఫ్రికా సంస్కృతి - ఇలా వేరువేరు సంస్కృతులు ఉన్నాయి. రెండవ వాటికన్ కౌన్సిల్‌లో ఈ విషయాలను గుర్తించి, కూలంకషంగా చర్చించారు. ఆ సమావేశాల పత్రాలు చదివితే చర్చి ఆలోచనా ధోరణిలో వచ్చిన మార్పు తెలుస్తుంది.

గతంలో మేము అనేక తప్పిదాలు చేశాం. క్రీస్తు వల్ల తప్పితే మోక్షం మరొకలాగ సాధ్యపడదని అన్నాం. కాని అది పూర్తిగా నిజం కాదు. విశ్వాసం ఉంటే మోక్షం లభిస్తుంది అని చెప్పుకోవాలి. మోక్షం భగవంతుని ద్వారా లభిస్తుంది కానీ మతం ద్వారా కాదు అనే వాక్యంలో అన్నింటికి సమాధానం ఉంది. నీకు నచ్చిన రీతిలో భగవంతుని ఆరాధించు. భగవంతుని వేదాంత మార్గంలో తెలుసుకోవాలనుకుంటే మంచిదే, కానీ వేదాంత మార్గంలో కూడా ఆరు రకాల దృక్పథాలు ఉన్నాయి. ద్వైతం, అద్వైతం మొదలైనవి. భగవంతుడిని ఎవరూ పూర్తిగా తెలుసుకోవడం అనేది ఉండదు. ఎవరికి తోచిన విధంగా వారు ఆయనని అర్థం చేసుకుంటారు. భగవంతుడిని మన భాషలో వర్ణించలేము.

నన్ను ఉద్దేశించి అడిగిన ప్రశ్నలన్నీ చాలా మంచి ప్రశ్నలు. అయితే వీటన్నింటికి క్లుప్తంగా సమాధానం ఇస్తాను. ఎందుకంటే వీటికి వివరంగా సమాధానం ఇవ్వాలంటే ఒక్కొక్క సమాధానం ఒక ప్రసంగం అవుతుంది. అన్నింటికి ముఖ్యమైనది విశ్వాసం. విశ్వాసానికి, తర్కానికి ఎంతో తేడా ఉంది. విశ్వాసానికి సంబంధించిన అంశాలకు తర్కాన్ని అన్వయించకూడదు. ఏ మతం మోక్షాన్ని ఇవ్వలేదు. ఎందుకంటే మోక్షం భగవంతుని ద్వారా లభిస్తుంది. ప్రస్తుతం సాగుతున్న మతమార్పిడి కార్యకలాపాలు పూర్తిగా తప్పు. నేను వాటిని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను. నిజమైన మార్పు దైవభక్తునిగా మారడంలో ఉంది. అంతేకాని మతం నుండి మతానికి మారడం మార్పు కాదు. ఈ విషయాలను ఎంతైనా వివరించ వచ్చును.

★ ఒకవేళ మిషనరీల లక్ష్యం కేవలం బీదవారికి సేవచేయడమే అయితే, ఫ్రాలే ప్రస్తావించినట్లు చర్చి మిషనరీలకి, క్రైస్తవులలో ధనవంతులకి మతమార్పిడిలు చేయరాదని ఎందుకు ఆజ్ఞలు జారీ చేయదు. ఇంతకు ముందు జరిగిందేదో జరిగిపోయింది. ఇక ముందు సమస్యలు తలెత్తకుండా

అటువంటి ఆజ్ఞల్ని లిఖితపూర్వకంగా ఎందుకు జారీ చేయకూడదు?

అరుళప్ప: ఇది మంచి ప్రశ్న కానీ అలా చేయడం సాధ్యం కాదు. ఎందుకంటే ఇతరులపై నాకు ఎలాంటి అధికారం లేదు.

★ పోప్ కాథలిక్కులపై ఆధిపత్యం వహిస్తున్నారు కదా?

అరుళప్ప: లేదు. ఎవరిమీద ఎవరి ఆధిపత్యం ఉండదు. అందరికీ స్వేచ్ఛ ఉంది. భగవంతుడు అందరికీ స్వేచ్ఛనిచ్చాడు. ఎంత మంది నిజంగా మతాచారాలను పాటిస్తున్నారు? కనుక సరిగా మతాన్ని పాటించని వారివద్దకు వెళ్ళి కేవలం సేవ మాత్రమే చేయాలి, మరొకటి చేయరాదని నేను ఎలా శాసించగలను? వాళ్ళ మీద నాకు ఎలాంటి అధికారం లేదు. నేను చేయగలిగింది అలాంటివారి ఆలోచనలు మారాలని ప్రార్థించడమే. దీనినే గ్రీకులో నీ మనసును మార్చుకో అని అంటాం.

చర్చి భగవంతుని రాజ్యంలో ఒక భాగం మాత్రమే. అదే భగవంతుని రాజ్యం కాదు. 40 సంవత్సరాల క్రితం చర్చికి ఈనాటి చర్చికి అదే తేడా. దీనిని గమనించాలి.

★ క్రైస్తవం బహుదేవతారాధనకి వ్యతిరేకంగా ఏర్పడినదే కదా! ఎక్కడెక్కడ అడుగుపెట్టిందో అక్కడ స్థానిక మతాలను, సంస్కృతులను నాశనం చేసింది కదా?

అరుళప్ప: ఇది నిజం కాదు. ఈనాడు విభిన్న మతధోరణులు ఉన్నాయి. మధ్యయుగంలో మీరు చెప్పినట్లుగా ఉండి ఉండవచ్చును. కానీ రెండవ వాటికన్ కౌన్సిల్ తరువాత ఎంతో మార్పు వచ్చింది. మీరు అమెరికా మొదలైన దేశాలన్నింటిలో క్రైస్తవులే ఉన్నారని అనుకుంటున్నారు. నిజానికి డా. డేవిడ్ ఫ్రాలే క్రైస్తవుడు కారు. ఆయన ఈ విషయాల్ని ఎంతవరకు ఒప్పుకుంటారో నాకు తెలియదు. క్రైస్తవం భారత్‌కి మొదటి శతాబ్దంలో

వచ్చింది. ఏ సైన్యం బలవంతంగా ప్రజల మీద క్రైస్తవాన్ని రుద్దలేదు. భగవంతుడు అందరికీ స్వేచ్ఛ నిచ్చాడు.

మన దేశంలో ఉన్న భిన్నత్వం మరే దేశంలో లేదు. వివిధ మతాలలోని మంచిని ఒకచోటకి చేర్చుకోవాలి. భగవద్గీతలోని నిష్కామకర్మ కేవలం హిందువులకే కాదు. అందరూ దానిని ఆచరించాలి. కురుక్షేత్రంలో శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేశాడు అనేది విశ్వాసం. దీనికి తర్కంతో సంబంధం లేదు.

## సేవా భావన, త్యాగ భావన హిందువులు క్రైస్తవుల నుండి నేర్చుకోవలసిరావడం విచిత్రంగా ఉంది

చర్చాగోష్ఠిలో డా. డేవిడ్ ఫ్రాలే

ఎంతో ఆలోచనలను రేకెత్తించే అంశాలను మన ముందు ఉంచినందుకు ఆర్చ్‌బిషప్‌కు ధన్యవాదాలు. ఈ అంశాలను క్రైస్తవ సమాజం కూడా అంగీకరిస్తుందని నేను భావిస్తాను. దురదృష్టవశాత్తు అనేక సందర్భాలలో హిందువులు ఆర్చ్‌బిషప్ వంటి వారితో కాకుండా ఇతరులతో వ్యవహరించవలసి వస్తుంది. భారత్‌లో పనిచేస్తున్న మిషనరీలు ఆర్చ్‌బిషప్ వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించరు. అయితే ఆర్చ్‌బిషప్ క్రైస్తవ మతం ఎలా ఉండాలో ఒక నమూనాని మన ముందు ఉంచారు.

కానీ మనం వాస్తవ ప్రపంచంలో ఎదురయ్యే పరిస్థితులను ఎదుర్కోనవలసిందే. మిషనరీలు ప్రసారసాధనాల ద్వారా, పాఠ్యపుస్తకాల ద్వారా చేస్తున్న ప్రచారాన్ని ఎదుర్కోనవలసిందే. చర్చి ధోరణిలో ఎంతో మార్పు

వచ్చిందని ఆయన అన్నారు. ఢిల్లీలో విద్యాభారతికి చెందిన ఫాదర్ ఆంథోనీ డిమెల్లో హిందు, బౌద్ధ మతాలకు కూడా తగిన గౌరవం ఇవ్వాలని తన రచనలలో పేర్కొన్నారు. కానీ వాటికన్ ఆయన రచనలను నిషేధించింది. కనుక చర్చిధోరణిలో మార్పు ఏమీ రాలేదని స్పష్టమవుతోంది.

మిషనరీ క్రైస్తవం కంటే కాథలిక్కు క్రైస్తవం ఎంతో మారింది. హిందువులు క్రైస్తవాన్ని నిజమైన మతంగా, క్రైస్తవులు హిందుత్వాన్ని నిజమైన మతంగా గుర్తించగలగాలి. కాని ఇప్పటి వరకు ఏ క్రైస్తవ మతాధికారి క్రీస్తు మాత్రమే దేవుని పుత్రుడు కాదు అని ప్రకటించలేదు.

ఆర్చిబిషప్ మాదిరిగానే నేను కూడ ప్రశ్నలకి క్లుప్తంగా సమాధానం ఇస్తాను.

★ మోక్షం అంటే ఏమిటి. దానిని ఎలా సాధించవచ్చును?

ఫ్రాలే: పాపం నుండి విముక్తులు కావడమే మోక్షం అని క్రైస్తవుల భావన. కర్మ చక్రం నుండి, పునర్జన్మ నుండి విముక్తులు కావడమే మోక్షమని హిందువుల విశ్వాసం. కనుక ఈ రెండింటికి తేడా ఉంది.

ఎక్కువ క్రైస్తవ సంప్రదాయాలలో స్వర్గానికి వెళ్ళడమే జీవిత లక్ష్యమని పేర్కొనబడింది. స్వర్గం అంటే అది ఒక ప్రత్యేక లోకమని, అక్కడ నాశనం కాని శరీరాలతో జీవించవచ్చనే విశ్వాసం ఉంది. ఇలా మోక్షం అనే భావనకి అనేక అర్థాలు ఉన్నాయి. అన్ని మతాలు శాశ్వతమైన, వైశ్వికమైన దైవశక్తి వైపుగా దారితీస్తున్నాయి. అయితే వాటన్నింటి లక్ష్యం ఒకటేనని చెప్పలేము. హిందుత్వంలో కూడా వేరువేరు తాత్విక దృక్పథాలు వేరువేరు జీవితలక్ష్యాల్ని నిర్దేశించాయి.

★ క్రైస్తవం ఒక్కటే మోక్షానికి మార్గం అని బైబిల్‌లో ఎక్కడైనా ఉందా?

ఫ్రాలే: బైబిల్‌ని అనేక రకాలుగా వ్యాఖ్యానించవచ్చును. ప్రొటెస్టెంటులు, మతమార్పిడిని సమర్థించే వారు బైబిల్ అలా అంటుందని నమ్ముతారు. కొంత మంది దీనిని ఒప్పుకోకపోవచ్చును.

★ కాథలిక్కులకి ప్రొటెస్టెంట్లకి తేడా ఏమిటి రెండూ క్రైస్తవ మతానికి చెందిన పంథాలే కదా?

ఫ్రాలే: కాథలిక్‌లు కాథలిక్ చర్చి, పోప్ లను అంగీకరిస్తారు. ప్రొటెస్టెంట్లు వీరిని తిరస్కరిస్తారు. ప్రొటెస్టెంట్లు పోప్‌ని అంగీకరించరు. ప్రపంచంలోని ప్రముఖమైన ప్రొటెస్టెంట్ సంస్థలు పోప్‌ని ఆధ్యాత్మిక గురువుగా అంగీకరించవు. పోప్‌కి వ్యతిరేకంగా ప్రచారాన్ని సాగిస్తాయి.

క్రైస్తవ పంథాలలో అనేక తేడాలు ఉన్నాయి. ప్రొటెస్టెంట్లు, కాథలిక్కులు కాని పంథాలు ఉన్నాయి. ఇజ్రాయిల్‌లో ఉన్న ప్రాచీన చర్చిలు కాథలిక్‌వి కావు, ప్రొటెస్టెంట్‌వి కావు. అవి గ్రీకు సంప్రదాయ క్రైస్తవానికి చెందినవి.

★ భారత్‌లో పేదవారిని మతం మార్చడం గురించి మీరేమంటారు? ఇలా మతం మారడం వల్ల వారి సామాజిక స్థాయి పెరుగుతోందని మీరు అనుకోవడం లేదా?

ఫ్రాలే: మత మార్పిడి వల్ల కొంత మంది ఆర్థిక పరిస్థితి మెరుగుపడిన సంఘటనలు ఉండవచ్చును. కానీ ఆర్థికస్థితి మెరుగుపడాలంటే ఆర్థిక సాధనాల ద్వారా ప్రయత్నించాలి. ప్రభుత్వాలు ఈ విషయంలో ఎక్కువ చేయగలవు. హిందూ సమాజంలో పేదవారి ఉన్నతి ఇంకా సులభంగా జరగాలి. ఎందుకంటే త్యాగభావన, నిస్వార్థ సేవ మొదలైనవన్నీ వేదాలలో పేర్కొనబడ్డాయి. పేదలకి , జంతువులకి , సర్వప్రాణికోటికి ఉపకారం చేసేవిధంగా అనేక యజ్ఞాలు ఏర్పరచబడ్డాయి. కనుక హిందువులు

త్యాగభావనని, సేవాదృక్పథాన్ని క్రైస్తవుల నుండి నేర్చుకోవలసిరావడం విచిత్రంగా ఉంది. ఆధునిక కాలంలో హిందువులు ఈ గుణాలను మరచిపోయారు. వాళ్ళు తిరిగి సాటివారిపట్ల సానుభూతిని, దయని చూపడం నేర్చుకునేవరకు ఇలా ఏదో ఒక మతం సేవ ముసుగులో వ్యాప్తి చెందుతూనే ఉంటుంది. ఒకవేళ హిందువులే అమెరికాకి మిషనరీలను పంపి, ఇటువంటి మతమార్పిడి కార్యకలాపాలు సాగిస్తే అప్పుడు అమెరికన్లంతా హిందుత్వాన్ని స్వీకరిస్తారని నేను ఖచ్చితంగా చెప్పగలను.

మూఢవిశ్వాసానికి, ఆచారవ్యవహారాలకి, అన్ని మతాలలో అంతర్నిహితంగా ఉన్న ఆధ్యాత్మిక శక్తికి గల తేడాని మనం గుర్తించాలి. ప్రపంచంలోని ఏ మతాన్ని చూసినా అనేక లోపాలు కనిపిస్తాయి. ఆయా మతాల ఆదర్శాలను చూస్తే ఎన్నో ఉన్నతమైన అంశాలు కనిపిస్తాయి. అయితే వాస్తవ ప్రపంచంలో ఎవరెవరితో ఎలా మెలగాలన్నది మనకి తెలిసి ఉండాలి. అమెరికాలో ఉన్న హిందువులు అక్కడి క్రైస్తవులతో చర్చిస్తే అక్కడ వారికి ఆర్చ్‌బిషప్ వంటివారు కనబడరు. సాధారణ క్రైస్తవులే కనిపిస్తారు. అలాంటి వారితో ఎలా వ్యవహరించాలన్నది అక్కడి హిందువులకి తెలియాలి.

చివరగా నేను ఒక విషయాన్ని చెప్పదలుచుకున్నాను. హిందుత్వం పాశ్చాత్య మతాల మాదిరిగా విశ్వాసం మీద ఎక్కువగా ఆధారపడిన మతం కాదు. హిందుత్వం కన్యకి పుత్రుడి జననం, ఆఖరు ప్రవక్త వంటి తర్కబద్ధం కాని విషయాలను నమ్మమని శాసించదు. ఒక విషయాన్ని నమ్మేవారు నమ్ముతారు. లేని వారు కూడా హిందువులుగానే పరిగణింపబడతారు. చాలామటుకు హిందూవ్యవస్థలు ప్రత్యక్ష అనుభవానికే ప్రాధాన్యతనిస్తాయి. అందుకనే యోగ విద్యకి అంత ప్రాముఖ్యత లభించింది. మనస్సుని, బుద్ధిని శుద్ధి చేసుకోవడం ద్వారా ఎవరైనా భగవంతుని తెలుసుకోవచ్చును. దానికి ఒక పుస్తకం, ఒక ప్రవక్త, ఒక చర్చిల మధ్యవర్తిత్వం అవసరం లేదు. ఇలా

ప్రత్యక్షంగా అంతిమ సత్యాన్ని తెలుసుకునే పద్ధతినే అన్ని మతాలలో ప్రోత్సహించాలి. అలా చేయాలంటే మనం మూఢవిశ్వాసాలను వదిలించుకుని వాస్తవ స్థితికి తగినట్లుగా వ్యవహరించడం నేర్చుకోవాలి.

## మతమార్పిడుల ఔచిత్యం

– డా. డేవిడ్ ఫ్రాలే

మతమార్పిడి అందరిలో అనేక ఆలోచనల్ని, భావాల్ని రేకెత్తిస్తుంది. ఎందుకంటే మతం మార్చుకోమని మిషనరీ ఒక వ్యక్తిని ప్రోత్సహిస్తున్నాడు అంటే అది ఆ వ్యక్తి అస్తిత్వానికి సంబంధించిన విషయం అవుతుంది. మిషనరీ మతం మార్చదలుచుకున్న వ్యక్తిని ప్రస్తుతపు మతాచారాల నుండి వేరు చేయడానికి, వాటి పట్ల అసహ్యం కలిగేటట్లు చేయడానికి ప్రయత్నిస్తాడు.

అలాంటప్పుడు అవతలి వారి మతాన్ని దూషించడానికి, అవమానించడానికి ఏ మాత్రం సంకోచించడు. ఇలా మిషనరీ తన పని ప్రారంభించే ముందే ఇతర మతాల పట్ల, ఇతరుల విశ్వాసాలపట్ల ఖచ్చితమైన ఆలోచన, దృక్పథం ఏర్పరుచుకుని, వారిపై తన ఆలోచనలు, విశ్వాసాలు బలవంతంగా రుద్దాలనే ఉద్దేశ్యంతో ఉంటాడు. అంతేకాని ఇతరులతో చర్చించి, నిజానిజాలను పరిశీలించాలన్న ధోరణి ఏమాత్రం ఉండదు. ఇటువంటి ధోరణి దాదాపు భౌతికమైన హింస కలిగించే వత్తిడిని, ఘర్షణని కలిగిస్తుంది. మిషనరీ కార్యకలాపాలలో మేధోపరమైన, మానసికపరమైన హింస అంతర్నిహితంగా ఉంటుంది. ఈ కార్యకలాపాలు వ్యక్తుల్ని తమ మతం నుండి దూరం చేయడానికి ఉద్దేశించినవి. కనుక ఇవి వ్యక్తుల ఆలోచనల్ని, విశ్వాసాల్ని మార్చేందుకు, బలవంతంగా దారి మళ్ళించేందుకు ప్రయత్నిస్తాయి.

మిషనరీ కార్యకలాపాల్ని, క్రైస్తవ మతాన్ని విడిగా చూడటం సాధ్యంకాదు. ఎందుకంటే క్రైస్తవ మతానికి మిషనరీ కార్యకలాపాలు వెన్నెముకలా నిలిచాయి. క్రైస్తవం ప్రపంచాన్ని మొత్తాన్ని తన ప్రాబల్యంలోకి తెచ్చుకోవాలని ప్రయత్నించే మతం. అందువల్ల ఇతర మతాలలో పరస్పర భావ వినిమయానికి చర్చకి ఇక్కడ చోటు ఉండదు. తన లక్ష్యాలను, ఉద్దేశాలను, మిషనరీ కార్యకలాపాల వల్ల జరిగిన దారుణమైన మారణకాండని, విధ్వంసాన్ని క్రైస్తవం ఎప్పుడూ పట్టించుకో లేదు.

మనం చర్చించబోయే అంశాలు క్రైస్తవంతో పాటు ఇస్లాంకి కూడా వర్తిస్తాయి. ఎందుకంటే ఇస్లాం కూడా ప్రపంచాన్ని తన గుప్పెట్లోకి తెచ్చుకోవాలని నిరంతరం ప్రయత్నిస్తుంది. అమెరికా దేశంలో పుట్టి, కాథలిక్ స్కూలులో చదివి, కాథలిక్‌గా పెరిగి, ఆ తరువాత హిందుత్వ ఆధ్యాత్మిక భావాలను అనుసరించిన నేను ఈ విషయాన్ని ఇంకో క్రొత్త దృక్కోణంలో వివరించగలను. నేను ఇలా హిందూ జీవన విధానాన్ని అవలంబించడానికి ఎంతో మతపరమైన వ్యతిరేకతని ఎదుర్కొనవలసి వచ్చింది.

## మత మార్పిడి, మిషనరీ కార్యకలాపాలు

మత మార్పిడి అంటే ఏమిటి ? ఇచ్ఛాపూర్వకంగా, ఇతర మతాలను పరిశీలించిన తరువాత మతం మారడం వేరు. డబ్బుకు ఆశపడి, ప్రచారానికి ఆకర్షితులై, బలవంతంగా మతం మారడం వేరు. ఈ రెండింటికి ఎంతో తేడా ఉంది. కొందరు వ్యక్తులు ఇతరులకి తమ మత ఆచారాల గురించి తెలియజెప్పి వాటిని ఆచరించేటట్లు చేయడంలో సమస్యలేవీ తలెత్తవు. విజ్ఞాన శాస్త్ర విషయాలను చర్చించినట్లుగానే మత విషయాలను కూడా బహిరంగంగా చర్చించగలగాలి. కాని ఒక మతం ప్రయత్నపూర్వకంగా

వనరులను సేకరించి ఇతరులను మతం మారుస్తూ ఉంటే అందులో బహిరంగ చర్చకిగానీ, పరిశీలనకి కానీ అవకాశం ఉండదు. అలాంటి మతమార్పిడిని సైద్ధాంతిక పరమైన దాడి అనవచ్చును. ఇది మతపరమైన హింసకి, అసహిష్ణుతకి ప్రతిరూపమని అనవచ్చును.

వ్యవస్థీకృత మతమార్పిడి వేరు. వివిధ మత వర్గాల మధ్యసాగే చర్చలు వేరు. వ్యవస్థీకృత మతమార్పిడి ఒక దేశం మీద సుశిక్షితమైన సైన్యం దాడి చేయడం వంటిదే. ఈ మిషనరీ సైన్యం ఎక్కువగా వ్యతిరేకత ఎదురుకాని, తమ లక్ష్యాలు, ఉద్దేశ్యాలు తెలియని వర్గాలపై ముందుగా దాడి చేస్తుంది. అలాగే మత విషయాలలో విశాలదృక్పథాన్ని కలిగి ఉండే వర్గాలలో కూడా తన కార్యకలాపాల్ని విస్తరింపజేస్తుంది.

ఇలాంటి వ్యవస్థీకృత మతమార్పిడిని మతాంతరీకరణ (evangelization) అని పిలుస్తున్నారు. కాథలిక్ చర్చి ఇదే పేరును ఉపయోగిస్తున్నది. ప్రొటెస్టెంట్లు దీనినే మతాంతరీకరణ ఉద్యమం (evangelical movement) అని అంటున్నారు. ఏదైనా ఒకటేనని మనం గుర్తించాలి. మతాంతరీకరణకు ప్రయత్నించే వారికి ప్రపంచాన్ని మొత్తాన్ని క్రైస్తవ మతంలోకి మార్చడమే ప్రధాన లక్ష్యం. అంటే వీళ్ళు ఇతర మతాలనన్నింటిని తిరస్కరిస్తున్నారని స్పష్టమవుతుంది. ఇటువంటి మతాంతరీకరణ ఉద్యమాలు భారత్‌లోని హిందువుల్ని మతం మార్చడానికి రాష్ట్రాల వారీగా, వర్గాల వారీగా, గ్రామాల వారీగా విడివిడిగా పథకాలను రూపొందిస్తున్నాయి. మతం మారిన వారి సంఖ్యని గుర్తించి వారిని ఎప్పటికప్పుడు క్రీస్తు విధేయుల జాబితాలో చేరుస్తూ ఉంటారు.

మతాంతరీకరణ, మతమార్పిడి కార్యకలాపాలకు పాల్పడే వారు ఇతర మతాలతో చర్చలకిగాని, పరస్పర భావ వినిమయానికి కానీ సిద్ధపడరు. వారి

దృష్టిలో తమదే నిజమైన మతం. ఇక ఏ ఇతర మతానికి తమ మతంతో సమానస్థాయి ఇవ్వడం వారికి ఇష్టం ఉండదు. నిజమైన చర్చ విశాలమైన దృక్పథం,సమానత్వాల వల్ల సాధ్యపడుతుంది. కనుక నిజమైన చర్చ క్రైస్తవ మతానికి, ఇతర మతాలకి మధ్య జరిగే అవకాశం లేదు. వేటగానికి, వేటాడబడేవారికి మధ్య చర్చ సాధ్యపడదు కదా! మిషనరీలు చర్చించడానికి సిద్ధపడుతున్నారు అంటే అది తమ కార్యకలాపాల్ని మరింత విస్తరించడానికైనా అయి ఉంటుంది లేదా మతం మారిన వారిని తమ మతంలోనే ఉంచుకునే ప్రయత్నమైనా అయి ఉంటుంది. మిషనరీ తన ధోరణిని ఎప్పుడూ మార్చుకోడు.

మిషనరీ వ్యాపారం ప్రపంచంలోనే అతి పెద్ద ఎత్తున, ఎంతో ధనసంపత్తితో సాగుతున్న వ్యాపారం. ఇందులో అనేక కాథలిక్, ప్రొటెస్టెంట్ మతాంతరీకరణ (ఇవాంజలికల్) వర్గాలు పాలు పంచుకుంటున్నాయి. ఇది ఒక పెద్ద బహుళజాతి సంస్థ వ్యాపారం వంటిది. మతమార్పిడులను ప్రోత్సహించేందుకు పథకాలను రూపొందించడానికి, ప్రచారానికి, ధన సేకరణకి, కేటాయింపులకి పూర్తిస్థాయిలో, పూర్తిసమయం పనిచేసే కార్యకర్తలు ఉన్న అనేక సంస్థలు ప్రయత్నిస్తున్నాయి. ఇలాంటి మిషనరీ కార్యకలాపాలను స్థానిక మతాలు ఎదుర్కోవడం సాధారణ వ్యాపారస్థుడు పెద్ద ఎత్తున వ్యాపారం చేసే మెక్‌డొనాల్డ్ వంటి కంపెనీని ఎదుర్కోనడం లాంటిదే. అనేక తృతీయ ప్రపంచ దేశాల్లో స్థానిక వ్యాపార సంస్థల్ని కాపాడేందుకు చట్టాలు ఉన్నాయి కానీ స్థానిక మతాలను పరిరక్షించే ఏర్పాట్లు ఏవీ లేవు నిజానికి మిషనరీ కార్యకలాపాలు సైద్ధాంతిక యుద్ధం వంటివి. ఒక పథకం ప్రకారం, ఒక లక్ష్యాన్ని సాధించేందుకు, ఒక ప్రయోజనంతో అవి కొనసాగుతాయి. ప్రసారసాధనాలు, డబ్బు ఉపయోగించి ప్రజలలో భావాత్మకమైన ఉద్రేకాన్ని కలిగించి వారిని మతం మార్చడం జరుగుతూ ఉంటుంది. కనుక మిషనరీ

కార్యకలాపాలంటే అక్కడక్కడ జరిగేవి కాదు. ఇది ప్రపంచంలోని అన్ని మతాలను తొలగించి వాటి స్థానంలో ఒకే మతాన్ని వ్యాప్తి చేయడానికి జరుగుతున్న ప్రయత్నమని గుర్తించాలి.

స్థానిక అమెరికన్లు కానీ, ఇస్లాంకి ముందు అరబ్‌లు కానీ మిషనరీ కార్యకలాపాల మూలంగా తమ ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలకు దూరమయ్యారు. పాకిస్థాన్‌లో పూర్తిగా మాయమయినట్లుగానే హిందుత్వం మిషనరీ కార్యకలాపాల్ని ఎదుర్కొని నిలబడలేకపోతే భారత్‌లో కూడా మాయమైపోతుంది.

మిషనరీ కార్యకలాపాలకి, మతస్వేచ్ఛకు సంబంధం లేదు. ఇది ఇతర మతాలను పూర్తిగా నాశనం చేసేందుకు ఒకమతం చేస్తున్న ప్రయత్నం మాత్రమే. ఇలాంటి సంకుచితమైన ధోరణి మతసహనాన్ని, పరస్పర అవగాహనని పెంచలేదు. మిషనరీలు భిన్నత్వాన్ని, మత స్వేచ్ఛని అంతం చేయాలని ప్రయత్నిస్తున్నారు. తమ మతాన్ని ప్రపంచమంతటా వ్యాపింపచేయడానికి ప్రాణాలకు సైతం తెగించి మిషనరీలు ప్రయత్నిస్తున్నారు.

మిషనరీ ఒక వస్తువును అంటగట్టడానికి ఇంటింటికి తిరిగే సేల్స్‌మన్ లాంటివాడు. లేదా దండెత్తి వచ్చే దోపిడి దారు వంటివాడు. ఇలాంటి విధ్వంసకర కార్యకలాపాలు ఎన్నటికి సామాజిక సామరస్యాన్ని పెంపొందించలేవు.ఇవి ఎవరి హక్కు కాదు. నిజానికి మిషనరీల బారిన పడకుండా ఉండేందుకు ప్రజలకి హక్కుని కల్పించాలి. పాశ్చాత్యదేశాల్లో జహోవా సాక్షుల పేరున వచ్చే మిషనరీల వల్ల ప్రజలు ఇబ్బందులు పడటం మనకు తెలుసు. ఇలాంటి మిషనరీల వల్ల ఆసియాలో సామాన్య ప్రజానీకం ఎంత వత్తిడికి, గందరగోళానికి గురిఅవుతున్నారో ఎవరైనా గమనించారా?

ఇతర మతాలపై దాడి చేసే హక్కు ఏ వర్గానికి , దేశానికి ఉండకూడదు. ఈ మతమార్పిడిలోనే సేవా కార్యక్రమాలు ఉన్నా వాటివల్ల

జరిగే మేలు కంటే కీడే ఎక్కువ.

## మతమార్పిడి చరిత్ర

మతమార్పిడి చరిత్ర ఏమిటి, ఇది ఎలా ప్రారంభమైంది, దీని ఫలితాలు ఏమిటన్నది పరిశీలిద్దాం. రెండు వేల ఏళ్ళక్రితం క్రైస్తవ మతం పుట్టక ముందు ఇలా పెద్దఎత్తున వ్యవస్థీకృతంగా మతమార్పిడులు సాగించే ప్రయత్నం ఏ మతం చేయలేదు. నాలుగవ శతాబ్దంలో రోమ్ సామ్రాజ్యం పూర్తిగా క్రైస్తవీకరణ చెందిన తరువాత ఈ మిషనరీ కార్యకలాపాలు ఊపందుకున్నాయి. రోమన్ చర్చి ప్రభుత్వ అధికారాన్ని, సైన్యాన్ని, ప్రభుత్వధనాన్ని మతవ్యాప్తికి ఉపయోగించింది. చర్చి, ప్రభుత్వం ఒకటిగా పనిచేశాయి. మధ్యయుగం దాకా యూరప్ అంతటా ఇది సాగింది.

ఏడవ శతాబ్దంలో ఇస్లాం చర్చిని, ప్రభుత్వాన్ని పూర్తిగా ఒకటి చేసింది. మతాన్ని, రాజకీయాల్ని కలిపివేసింది. ఖలీఫా పరిపాలనాధి కారాలతోపాటు మతాధికారాలు కూడా కలిగి ఉండేవాడు. ఇలా మతాధికారం, పాలనాధికారం ఒకరికే అప్పజెప్పడం ఈనాటికీ ముస్లిం దేశాలలో కనబడుతుంది. పాకిస్థాన్‌లో ఖురాన్‌నే అత్యున్నత చట్టంగా ప్రకటించారు. పాశ్చాత్యదేశాల్లో బైబిల్‌ని అంతిమ చట్టంగా ప్రకటించగలరా? అయినా యూరప్‌లో చర్చి అనేక శతాబ్దాల పాటు ఆధిపత్యాన్ని చెలాయించింది.

క్రైస్తవం రాక పూర్వం రోమ్‌లో ప్రభుత్వ మతం ఒకటి ఉండేది. కాని అది కేవలం రాజకీయ ప్రయోజనాలకే ఉపయోగించబడేది. ప్రభుత్వ మతాన్ని సమర్థించినంత కాలం రోమ్ అనేక ఇతర మతాలను కూడా సహించింది. ఇలా ప్రభుత్వ మతాన్ని అంగీకరించని కారణంగా అనేక మంది క్రైస్తవుల్ని రోమన్‌లు చంపివేశారు.

తమది మాత్రమే నిజమైన మతమనే క్రైస్తవం రోమ్‌లో వ్యాప్తి

చెందిన తరువాత అప్పటి వరకు ప్రభుత్వం అనుసరించిన పరమత సహనం పూర్తిగా మాయమైంది. ఇతర మతాలకు చెందిన దేవాలయాలు, పాఠశాలలు మూసివేయబడ్డాయి. కొన్నింటి స్థానంలో చర్చిలు వెలిశాయి. ఆరవ శతాబ్దంలో ఏథెన్స్‌లో ప్రముఖ ప్లేటోనిక్ అకాడమీ మూతపడింది. పాగన్ మతాలన్నీ నిషేధింపబడ్డాయి. పాగన్ మతాలకు చెందిన వేలాది మంది చంపబడ్డారు. సామ్రాజ్యవాదం కాలంలో క్రైస్తవ మిషనరీ కార్యకలాపాల మూలంగా ప్రపంచమంతటా మారణకాండ తలెత్తింది. క్రూసేడ్లు జరిగాయి. అమెరికా, ఆఫ్రికా, ఆసియాలలో స్థానిక జాతులు ఊచకోతకు గురయ్యాయి. స్థానిక మతాలు నిషేధింపబడ్డాయి. ప్రార్థనా స్థలాల క్రైస్తవులు ఆక్రమించుకున్నారు. 16 వ శతాబ్దిలో మెక్సికోలో, పెరూలో స్పెయిన్‌కి చెందిన మిషనరీలు సాగించిన దురంతాలు ఈ శతాబ్దిలో జరిగిన నాజీ దురంతాలను మించిపోయాయి. 19వ శతాబ్దంలో మిషనరీ సామ్రాజ్యవాదం ఆఫ్రికా జాతులను నాశనం చేసింది. ఆ తరువాత క్రమంగా ఇది తగ్గుతూ వచ్చింది. కానీ ఈ ఐదువందల సంవత్సరాలలో తాము పాల్పడిన మారణకాండకు, తాము సాగించిన విధ్వంసానికి మిషనరీలు ఏనాడూ పశ్చాత్తాపాన్ని ప్రకటించలేదు.

నిజానికి మిషనరీ సామ్రాజ్యవాదం పూర్తిగా అంతం కాలేదు. అది ఆర్థికపరమైన పాశ్చాత్యీకరణలో వ్యాప్తి చెందుతుంది. ప్రస్తుతం ప్రపంచమంతటా సాగుతున్న ఆర్థికపరమైన పాశ్చాత్యసంస్కృతి విస్తరణని క్రైస్తవ మిషనరీలు తమ కార్యకలాపాలకు కూడా ఉపయోగించుకుంటున్నారు. పాశ్చాత్య కంపెనీల అపారమైన సంపదని, వనరులను వీరు ఉపయోగిస్తున్నారు. క్రైస్తవేతరులు ఎక్కువగా ఉన్న ప్రదేశాలలో కూడా పాశ్చాత్యదేశాల ధనసంపత్తి, ప్రసార సాధనాల మూలంగా క్రైస్తవ మిషనరీలదే పై చేయి అవుతోంది.

ప్రపంచంలో చాలావరకు దేశాలు సెక్యులర్ విధానాలను

అనుసరిస్తున్నాయి. అయినప్పటికీ మతాలన్నింటికి ఒకే తరహా గౌరవం లభించడం లేదు. ఇప్పటికీ పాశ్చాత్య మతాలు పాశ్చాత్యేతర మతాల పట్ల అసహన ధోరణినే అవలంబిస్తున్నాయి. ఈ మతాలు ఆర్థికపరమైన, ప్రసారసాధనాల విషయంలో తమకి ఉన్న ఆధిక్యతని మతమార్పిడులకి వినియోగిస్తున్నాయి. సామ్రాజ్యవాదం అడుగంటిన తరువాత మిషనరీ కార్యకలాపాల తీరు మారింది. గతంలో మిషనరీలు పాల్పడిన మారణకాండని, విధ్వంసాన్ని ఎప్పుడూ మరచిపోలేము.

పాశ్చాత్యదేశాల్లో సెక్యులరిజం, మతస్వేచ్ఛా పెంపొందడానికి కారణం క్రైస్తవ మతం కాదు. క్రైస్తవ మతపు దాడిని తట్టుకుని తిరిగి బలపడుతున్న ప్రాచీన సెక్యులర్ గ్రీస్–రోమన్ సంప్రదాయం మూలంగా ఈ మార్పు కలిగింది. పాశ్చాత్య దేశాల్లో క్రైస్తవ మత ప్రభావం తగ్గి ఉండవచ్చును కానీ మధ్యయుగపు తీవ్రమైన ధోరణి మాత్రం మిషనరీలలో తగ్గలేదు.

## మత మార్పిడి వెనుక లక్ష్యం ఏమిటి ?

మతమార్పిడిల వెనుక ఉద్దేశ్యం ఏమిటి? ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని మతం మార్చాలని ఎందుకు ప్రయత్నిస్తున్నాడు? భిన్నత్వం కలిగిన మన సమాజంలో అనేక సంస్కృతులు, కళలు, భాషలు, మతాలు ఉన్నాయి. అలాంటప్పుడు ప్రతి ఒక్కరు మన మతాన్నే అనుసరించాలని అనుకోవడం ఎందుకు. ఈ భిన్నత్వమే మన సంస్కృతి, ఉన్నతమైన నాగరికతల ప్రత్యేకత.

తను ప్రచారం చేస్తున్న మతం ద్వారా తప్పితే మరొకలా మోక్షం సాధించలేమని మిషనరీ విశ్వసిస్తాడు. అలా విశ్వసించకపోతే ఇతరుల్ని మతం మార్చే అవసరమే ఉండదు. తన మతం అనేక ప్రత్యేకతలను కలిగి ఉందని,

మిగిలిన వాటికంటే మెరుగైందని మాత్రమే చెప్పడం లేదు. తన మతమే నిజమైన మతనమని, ఇతర మతాలన్నీ అసత్యాలని చెపుతున్నాడు.

కనుక మతమార్పిడి ధోరణిలో అంతర్గతంగానే అసహనం ఇమిడి ఉంది. అన్ని మతాలు ఒకటేనని, అన్నింటిలో సత్యం ఉందని అనుకుంటే ఇక ఇతర మతస్థుల్ని మతమార్చడానికి ఇంత పెద్ద ఎత్తున ప్రయత్నం అవసరం ఉండదు. అలాగే ఇతర మతాలను నాశనం చేయాలనే ధోరణి తలెత్తదు. సంకుచిత ధోరణి కలిగిన మతం మాత్రమే పెద్ద ఎత్తున మతమార్పిడులకి పాల్పడుతుంది.

క్లుప్తంగా చెప్పాలంటే మత మార్పిడి సెక్యులరిజానికి వ్యతిరేకం. సెక్యులర్ సమాజంలో ఉండే భిన్నత్వాన్ని ఇది నాశనం చేస్తుంది. విచిత్రమైన విషయం ఏమిటంటే మతస్వేచ్ఛ పేరుతో సెక్యులర్ చట్టాలే మతమార్పిడికి అవకాశం కల్పిస్తున్నాయి. ఒకప్పుడు సామ్రాజ్య వాద శక్తులను తమ మతమార్పిడి కార్యకలాపాలకి ఉపయోగించుకున్న మిషనరీలే ఇప్పుడు ఈ చట్టాలను, మతస్వేచ్ఛను ఉపయోగించుకుంటున్నారు. సామ్రాజ్యవాదం ప్రబలంగా ఉన్నప్పుడు మతస్వేచ్ఛను అణగద్రొక్కిన వారే ఇప్పుడు మతస్వేచ్ఛ పేరున తమ కార్యకలాపాలు సాగిస్తున్నారు!

వ్యతిరేకత ఎక్కువ వ్యక్తమయ్యే చోట్ల మిషనరీలు మరింత తీవ్రంగా ప్రయత్నాలు సాగిస్తారు. ప్రొటెస్టెంట్లు ఇతర మతాలను దూషిస్తారు. మిషనరీలు హిందూమతాన్ని సైతాన్ మతంగా పరిగణిస్తారు. అమెరికాకి చెందిన మిషనరీ నాయకులైన పాట్ రాబర్ట్సన్, జర్రీ ఫాల్వెల్ లు ఈ విషయాన్ని పదే పదే చెపుతూ ఉంటారు. వీరి అనుచరులు భారత్‌లో మతాంతరీకరణను కొనసాగిస్తున్నారు. ఇలాంటి ప్రచారం ద్వారా మిషనరీలు తాము ప్రజలను సైతాను మతాల నుండి కాపాడటానికి కంకణం కట్టుకున్నామని నమ్మిస్తారు.

సమాజంలో ద్వేషాన్ని, అసహన ధోరణిని వ్యాపింపజేస్తారు. మీ మతం సైతాను మతమని ప్రచారం చేస్తున్న నేను మీ శ్రేయోభిలాషిని ఎలా అవుతాను? ఇలాంటి ప్రచారం వల్ల మీ సమాజానికి మంచి ఏం జరుగుతుంది ?

ఈనాడు అనేక దేశాలలో ఏ జాతి పట్ల వివక్షత చూపడంగాని, ఒక జాతిని అవమానించడంగాని చట్టవిరుద్ధమైన చర్య అవుతుంది. (కొన్ని సంవత్సరాల క్రితం వరకు శ్వేతవర్ణ క్రైస్తవులు నల్లవారిని దయ్యాలని దూషించేవారు)కాని ఇప్పటికీ హిందువుల్ని బహుదేవతారాధకులు, విగ్రహారాధకులు, సైతాన్ ఆరాధకులని దూషిస్తున్నారు. ఈ దూషణని మతస్వేచ్ఛ పేరుతో భరిస్తున్నారు. జాతి పేరున వివక్షత చూపడానికి వీలులేదు కానీ మత వివక్షత, మతదూషణలకు మాత్రం పాల్పడవచ్చును. మిషనరీలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకుంటున్నారు.

హిందుత్వం కూడా రోమన్, గ్రీకు, సెమిటిక్, ఈజిప్ట్, బాబిలోనియా మతాల వంటిదేనని చాలా మంది క్రైస్తవులు భావిస్తారు. క్రైస్తవ మతం పాగన్ మతాలుగా పిలువబడే ఈ మతాలను నాశనం చేయడానికి ప్రయత్నించింది. పాగన్ మతాలకి హిందుత్వానికి అనేక పోలికలు ఉన్నాయి. హిందువులను బైబిల్‌లో పేర్కొన్న విగ్రహారాధకుల తో పోల్చడం ద్వారా మిషనరీలు హిందుత్వంపై దాడికి పూనుకుంటారు. ఇలా భావించే వారిలో చాలా మంది పాగన్‌మతాలనుగాని, హిందుత్వాన్నిగాని ఎన్నడూ అధ్యయనం చేసి ఉండరు. వారికి యోగ, వేదాంతం, ఇతర హిందూ సంప్రదాయాలు, బౌద్ధమతపు ఆధ్యాత్మికత వంటివి ఏవీ తెలియదు. జంతువుల తలలతో ఉండే హిందూ దేవతలను చూపి హిందుత్వం అంటే మూఢ విశ్వాసాలని వీళ్ళు ప్రకటిస్తూ ఉంటారు.

కాథలిక్ చర్చి తన వ్యవహారంలో కొంత చాతుర్యాన్ని జోడిస్తోంది.

హిందుత్వంలో కొన్ని మంచి విషయాలు ఉండవచ్చునుగాని క్రైస్తవం వాటన్నింటికంటే మెరుగైనదని ప్రచారం ప్రారంభించింది! ఈ ధోరణిలో పైసమెత్తు పరమత సహనం కనబడినా అది పూర్తిగా నమ్మదగినది కాదు. కాథలిక్‌లు హిందుత్వం సైతాన్ మతం కాదని గుర్తిస్తే గతంలో అలా ప్రచారం చేసినందుకు, దాని వల్ల కలిగిన దుష్ఫలితాలకు వాళ్ళు ముందుగా క్షమాపణ చెప్పుకోవాలి. హిందూ తత్వశాస్త్రాల్ని తాము గౌరవిస్తామని కాథలిక్కులు ఈనాడు అంటున్నారు. కాని హిందువుల్ని మతం మార్చే ప్రయత్నాలకు మాత్రం స్వస్తి చెప్పడం లేదు. ఇది ఏ రకమైన పరమత సహనం? ఏ రకమైన గౌరవం ?

## మతమార్పిడి సిద్ధాంతం

మతమార్పిడి ఒక తరహా సిద్ధాంతాన్ని ప్రతిబింబిస్తుంది. ప్రజల విశ్వాసాల్ని, ఆలోచనల్ని, సిద్ధాంతాల్ని మార్చడమే దీని ఉద్దేశ్యం. ఒక తరహా సిద్ధాంతాన్ని మాత్రమే ఆచరిస్తూ మిగతా సిద్ధాంతాల్ని వ్యతిరేకించాలని, నిరాకరించాలన్నది మత మార్పిడి మూల సూత్రం. ఈ మతమార్పిడుల వెనుక ఉన్నది సంకుచిత దృక్పధం కలిగిన ఒక మతం. అందులో ఒకే దేవుడు, ఒకే మత గ్రంథం, ఒకే ప్రవక్త ఉంటారు. క్రైస్తవ మిషనరీలు క్రీస్తు మాత్రమే తమ రక్షకుడని క్రైస్తవం మాత్రమే నిజమైన మతమని ప్రజల్ని ఒప్పించేందుకు ప్రయత్నిస్తారు.

హిందూ సమాజం వంటి భిన్నత్వం కలిగిన సమాజంలో మతమార్పిడి ధోరణులు తలెత్తవు. హిందువులు అనేక పంథాలను అంగీకరిస్తారు. కనుక ఇతరులు తమ మతాన్ని వదలి హిందుత్వాన్ని స్వీకరించాలని అనుకోరు.

తమ మతాన్ని అనుసరించే వారే స్వర్గానికి వెళతారని, మిగిలిన మతస్థులు

తప్పకుండా నరకానికి పోతారని క్రైస్తవులు, ముస్లిములు నమ్ముతారు. ఇలా స్వర్గానికి హామీ ఇచ్చి, నరక భయం చూపడం మతమార్పిడి సిద్ధాంతంలో మొదటి సూత్రం. క్రైస్తవ మిషనరీలు మధ్యయుగపునాటి ఈ స్వర్గ-నరక భావాలను ఆసరగా చేసుకుని తమ కార్యకలాపాలు సాగిస్తున్నారు. క్రైస్తవ మిషనరీ పాగన్ శిశువులను నరకకూపం నుండి రక్షించేందుకే ఆసియాకి వెళుతున్నాడన్నది 19 శతాబ్దపు నమ్మకం.

ఈ స్వర్గ-నరక భావన వల్ల అసహిష్ణుత కలుగుతుంది. అంతేకాదు, దీని మూలంగా కలిగిన మానసిక సంక్షోభాన్ని తట్టుకోలేక అనేక మంది కాథలిక్కులు మనస్తత్వ వైద్యుడి సహాయాన్ని కోరుతున్నారు కూడా.

భగవంతుడు తనని విశ్వసించే వారి కోసం స్వర్గాన్ని, ఇతర మతస్థుల కోసం నరకాన్ని సృష్టించాడన్నది మిషనరీ కార్యకలాపాలకే కాకుండా మానసిక సంక్షోభానికి, హింసకి దారితీసింది. ఇలా చెప్పినది వంటే గొప్ప బహుమతి లభిస్తుందని, లేకపోతే ఘోరమైన శిక్ష పడుతుందనే ప్రచారం వ్యక్తుల ఇష్టాయిష్టాలను, ఆలోచనల్ని మార్చేందుకు ఆధారం అయింది. వ్యక్తుల విశ్వాసాలను అదుపు చేయాలని, మార్చాలని ప్రయత్నించే మతాలన్నీ ఈ రకమైన పద్ధతినే అనుసరిస్తాయి.

## మతమార్పిడి, సేవ, సమాజోద్ధరణ

తాము దీనుల, పతితుల ఉద్ధరణకి పాటుపడుతున్నామని, మతమార్పిడి చేయడం లేదని కొందరు మిషనరీలు అంటున్నారు. ఐతే మిషనరీల మతమార్పిడి కార్యకలాపాలను, వాటి చరిత్రని తెలుసుకున్న ఎవరికైనా వీరి మాటలు నమ్మశక్యంగా కనబడవు. నిన్నమొన్నటి వరకు సామ్రాజ్యవాద ప్రభుత్వాలను, సైన్యాలను తమ కార్యకలాపాలకి

ఉపయోగించుకున్న మిషనరీలు ఇప్పుడు తమకి ఎలాంటి దురుద్దేశాలు లేవని చెపితే నమ్మడం కష్టం.

నిజంగానే సమాజోద్ధరణ చేయాలనుకుంటే మిషనరీలు ఒక పాఠశాలని, ఆస్పత్రిని స్థాపించి మత ప్రమేయం లేకుండా నడపవచ్చును. మతప్రమేయం ఉన్నంతవరకు ఇవి మతమార్పిడి కార్యకలాపాలే అవుతాయి. మతమార్పిడికి సమాజసేవ అనే ముసుగు తొడిగినందువల్ల ఉపయోగం లేదు.

సమాజసేవ చేయదలుచుకుంటే మిషనరీలు విద్యావ్యాప్తి ద్వారా, ఆర్థిక సహాయాన్ని అందించడం ద్వారా అది చేయవచ్చును. కాని అందులో మతప్రమేయం ఉండకూడదు. సంకుచితమైన ధోరణి కలిగిన మతానికి ఇతరులను మార్చినందువల్ల పేదరికం, రోగాలు మాయం కావు.

ఫిలిప్పీన్స్ ఆసియాలో ప్రాచీనమైన క్రైస్తవ దేశం. కాని అది ఆసియాలో అతిపేద దేశాలలో ఒకటి కూడా. మతమార్పిడి వల్ల ఏ దేశపు ఆర్థిక స్థితి మెరుగు పడలేదు. ఉత్తర అమెరికాలోకంటే క్రైస్తవ మతాన్ని ఖచ్చితంగా పాటించే మధ్య, దక్షిణ అమెరికాలలో పేదరికం, నిరక్షరాస్యత తాండవిస్తూనే ఉన్నాయి. పాశ్చాత్యదేశాల్లో విద్యావంతులు క్రైస్తవ మతాన్ని అంతంత మాత్రంగానే అనుసరిస్తున్నారు. వాళ్ళు తూర్పు దేశాల మతాల వైపు, ఆధ్యాత్మికత వైపు మొగ్గు చూపుతున్నారు.

భారత్‌లో కుల వ్యవస్థను నిర్మూలించడం ద్వారా ప్రజలకు సహాయం చేస్తున్నామని, సామాజికంగా ఉద్ధరిస్తున్నామని క్రైస్తవ మిషనరీలు అంటూ ఉంటారు. కానీ దీనిని వాళ్ళు మతాన్ని నాశనం చేయడంద్వారా, మతమార్పిడుల ద్వారా కాకుండా హిందూ సమాజాన్ని సంస్కరించడం ద్వారా చేయవచ్చు. నిజానికి మతమార్పిడులకోసం వారు కుల విద్వేషాలను రెచ్చకొడుతున్నారు. క్రైస్తవ సమాజంలో ఇప్పటికీ సామాజిక అసమానతలు ఉన్నాయి. ముఖ్యంగా మధ్య, దక్షిణ అమెరికాలలో ఈ అసమానతలు

ఎక్కువగా కనిపిస్తాయి. అయినా అక్కడి క్రైస్తవులు మతమార్పిడి ద్వారా వీటిని తొలగించుకోవాలని అనుకోరు.

కనుక సమాజోద్ధరణ, మత మార్పిడి ఒకటి కాదు. ఇవి పరస్పర విరుద్ధమైనవి. ఒక వ్యక్తి మతం మారినందువలన అతని విద్యాస్థాయి, ఆర్థిక స్థితి మెరుగుపడవు. మత మార్పిడి కార్యకలాపాల వెనుక మానవ సేవ, సమాజసేవ ఉన్నాయని అంటూ ఉంటారు. కాని ఇది కూడా నమ్మశక్యంకాని విషయం. సమాజ సేవే లక్ష్యమైతే, మత ప్రమేయం లేకుండా అందరికీ సహాయం చేయగలగాలి. ప్రజల మత విశ్వాసాలను పట్టించు కోకుండా వాళ్ళకి కావలసిన సహాయాన్ని అందించాలి. వాళ్ళు రాళ్ళు, రప్పలని పూజించినా, వారి మతాన్ని గౌరవించగలగాలి. మీ మతాన్ని అనుసరించని వారంతా నరకానికి పోతారని దూషించకుండా ఉండాలి.

ఐతే ఇలాంటి సేవాదృక్పథం మిషనరీ కార్యకలాపాలలో ఎక్కడా కనపడదు. మానవసేవే లక్ష్యంగా పనిచేసేవారు సామూహిక మత మార్పిడులకు పాల్పడరు. నిజానికి అటువంటి ప్రయత్నాలు అమానుషమైనవని వాళ్ళు గుర్తిస్తారు.

## మతాలు–మత మార్పిడి–పాశ్చాత్య ప్రపంచంలో మత స్వేచ్ఛ

పాశ్చాత్య ప్రపంచంలో క్రైస్తవంతో సంబంధంలేని మతాలు, సంప్రదాయాల పట్ల వ్యతిరేకత ఉంది. హిందూ మత ఉద్యమాలను పాశ్చాత్యదేశాలలో సంప్రదాయాలుగా, పంథాలుగా గుర్తిస్తారు. అక్కడ ఏ సంప్రదాయం, ఏ పంథాపైన ఎవరైనా కేసు పెట్టవచ్చు. ఇలా అనేక హిందూ సంప్రదాయాల మీద అక్కడ అనేక మంది కేసులు పెట్టారు కూడా. పంథాలు,

సంప్రదాయాలు వేరు. సాంస్కృతిక, మత కట్టుబాట్లు వేరు- అని, అవి కుటుంబాలను విచ్ఛిన్నం చేస్తాయనే విమర్శ ఉంది. కాని ఇదే విమర్శ మిషనరీల కార్యకలాపాల విషయంలో నిజం. అందుకనే ప్రాచీన రోమనులు క్రైస్తవాన్ని ఒక పంథగా పరిగణించారు.

అమెరికాలో అన్నిమతాలకు సమానమైన గౌరవం లభిస్తుందని ఇక్కడివారు అనుకోవచ్చు. చట్టప్రకారం అది నిజమే అయినా, వాస్తవ స్థితి దీనికి భిన్నంగా ఉంటుంది. ఉదాహరణకు అమెరికా దక్షిణ ప్రాంతంలో మతఛాందస క్రైస్తవులు ఎక్కువగా ఉన్న బైబిల్ బెల్టు లో హిందువులు తమ దేవాలయాలను నిర్మించడం సాధ్యం కావడం లేదు. అమెరికాలో ఒక చర్చిని నిర్మించడం కన్నా ఒక గుడిని నిర్మించడానికి ఎక్కువ కష్ట పడవలసి వస్తుంది. అనేక ప్రాంతాలలో గుడులు, స్కూలు నిర్మాణం చర్చి మాదిరిగా కట్టవలసివస్తుంది. లేకపోతే స్థానిక ప్రభుత్వాలు వాటి నిర్మాణానికి అనుమతిని ఇవ్వవు. పూర్తిగా దేవాలయాల ఆకారంలో ఉన్న గుడులు అమెరికాలో ఉన్నా వాటిని నిర్మించడానికి ప్రత్యేకంగా అనుమతి తీసుకోవలసి వచ్చింది.

హిందుత్వం అనేక పంథాల, సంప్రదాయాల కలయిక అని అనేకమంది అమెరికన్లు భావిస్తారు. వివిధ పంథాలను నాశనం చేయాలనే ఉద్దేశ్యంతో క్రైస్తవులు రూపొందించిన కూటములు హిందూ మత వర్గాలపై అనేక రకాల కేసులు పెడుతూ ఉంటాయి. ఇస్కాన్, ఆనంద (యోగానంద) వర్గం, హిమాలయన్ ఇన్స్టిట్యూట్, రజనీష్, సిక్కు యోగిభజన్ వంటి సంస్థలు ఇలాంటి కేసులలో కొన్ని మిలియన్ డాలర్ల పరిహారం చెల్లించుకోవలసివచ్చింది. ఇటువంటి చర్యలద్వారా క్రైస్తవ వర్గాలు ఇతర మతాలను ఇరుకునపెట్టడానికి ప్రయత్నిస్తూ ఉంటాయి.

ఈ విధంగా అమెరికాలోని క్రైస్తవులు బాహాటంగా చేయలేని పనిని

కోర్టుల ద్వారా చేస్తున్నారు. హిందుత్వాన్ని ప్రచారం చేసే వారెవరైనా అమెరికాలో ఇలాంటి న్యాయ పరమైన చిక్కులను ఎదుర్కోవలసివస్తుంది. హరే కృష్ణ వంటి సంస్థలు అక్కడ మత మార్పిడికి పాల్పడితే తీవ్రమైన వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుంది. కాని భారత్‌లో క్రైస్తవ మిషనరీలకు ఇటువంటి న్యాయపరమైన చిక్కులు కాని, అవరోధాలుకాని లేవు.

పాశ్చాత్య దేశాల ప్రసారసాధనాలు, పాఠ్యపుస్తకాలలో హిందుత్వాన్ని వామాచారాలు, విగ్రహారాధన మొదలైన వాటికి మూలమని ప్రచారం జరుగుతోంది. క్రైస్తవాన్ని గురించి భారతీయ పత్రికల్లో ఇలా ఎవరూ ప్రచారం చేయలేరు. విశ్వవిద్యాలయాల్లో సైతం సర్వమత సమావేశాలు, చర్చా గోష్టులలో ప్రపంచంలో మూడవ అతిపెద్ద మతమైన హిందుత్వాన్ని గురించి ఎవరూ పట్టించుకోరు. ఎందుకంటే హిందుత్వం మతమార్పిడులకు ప్రయత్నించదు.

పాశ్చాత్యదేశాల్లో మతసహనం పెరిగిందని పొరబడకూడదు. అక్కడ చట్టపరమైన సెక్యులరిజం వెనుక మతమౌఢ్యం దాగిఉంది. అంతేకాదు, ఇతర దేశాలలో క్రైస్తవుల ప్రయోజనాలకు భంగం వాటిల్లితే పాశ్చాత్యదేశాలు గగ్గోలు పెట్టడం మనం చూశాం. క్రైస్తవేతరులు ఎలాంటి వివక్షతకి గురయినా ఈ దేశాలు పట్టించుకోవు. ఈ మధ్య రష్యన్లు మార్మాన్స్ అనే అమెరికా మిషనరీ వర్గాన్ని ఒకపంథా అని విమర్శించారు. కాని భారత ప్రభుత్వం మాత్రం ఇప్పటి వరకు ఎప్పుడూ హిందూ సంప్రదాయాలను పరిరక్షించేందుకు ఇలాంటి ప్రయత్నం చేయలేదు.

కమ్యూనిష్టులు, మార్క్సిస్టులు కూడా మత మౌఢ్యాన్ని పెంచిపోషించారన్నది చారిత్రక సత్యం. కానీ భారత్‌లో కమ్యూనిష్టులు మాత్రం మతస్వేచ్ఛని పరిరక్షిస్తామని చెప్పుకుంటున్నారు. స్టాలిన్ అనేక

చర్చిల్ని, మసీదుల్ని నాశనం చేయించాడు. కాని అదే స్టాలిన్ చిత్రపటాలు కేరళ, పశ్చిమబెంగాల్ ప్రభుత్వ భవనాలపై వేలాడుతూ ఉంటాయి.

## వనవాసీ, గిరిజన సంస్కృతుల్ని నాశనం చేసిన మిషనరీ కార్యకలాపాలు

మిషనరీ కార్యకలాపాల్లో ప్రేమ, సేవా భావాల కంటే అసహిష్ణుత, హింస ఎక్కువ. ముఖ్యంగా గిరిజన ప్రాంతాలలో మిషనరీల కార్యకలాపాల వల్ల స్థానిక సంస్కృతులు, సంప్రదాయాలు పూర్తిగా దెబ్బతిన్నాయి.

గిరిజన సంస్కృతుల్లో అనేక సుగుణాలు ఉన్నాయి. మిషనరీలు వెళ్ళిన చోటల్లా గిరిజన సంస్కృతుల్ని నాశనం చేశారు. కాని హిందుత్వం మాత్రం గిరిజన మతాలను నాశనం చేయకపోగా వాటినుండి అనేక అంశాలను స్వీకరించింది.

హిందుత్వం, బౌద్ధం, జైన, సిక్కు, షింటో మతాల్లో అనేక ఉన్నత విలువలు ఉన్నాయి. అయితే వీటిని మిషనరీలు గుర్తించరు. కేవలం వీటిని బూటకపు మతాలుగా పరిగణించి, వీటి బారి నుండి ప్రజల్ని రక్షించాలని అనుకుంటారు.

మిషనరీ మతాల్ని అనుసరించేవారు తమ మతాలు ఎన్నో ఉన్నత విలువలు కలిగి, ప్రజలకి మేలు చేసిన హిందుత్వం వంటి మతాలకు వ్యతిరేకంగా పనిచేస్తున్నాయన్నది తెలుసుకోవాలి. మతాలపై దాడి చేయడమంటే ప్రజలపై దాడి చేయడమే. హిందుత్వంపై దాడి చేయడమంటే హిందువులపై దాడి చేయడమే.

## మతమార్పిడి – నైతికత

మతమార్పిడి సెక్యులరిజాన్ని పాటించదు. మత స్వేచ్ఛని, మత సహనాన్ని, భిన్నత్వాన్ని ఒప్పుకోదు. మతమార్పిడికి సంకుచితమైన మతం ఆధారం. క్రైస్తవేతరులంతా సైతాను ప్రభావానికి లోనై వ్యవహరిస్తున్నారని మిషనరీ భావిస్తాడు. అంతేకాని ఇతర మతాలు కూడ తన మతం వంటివేనని ఒప్పుకోడు.

మిషనరీలు అనేక రకాల ప్రలోభాలను, బలప్రయోగాన్ని ఉపయోగించి తమ పనులు సాగించారు. ఈ కార్యకలాపాలు సెక్యులర్ సమాజంలో అనైతికమైనవి అవుతాయిగాని సామ్రాజ్యవాద, మత రాజ్యంలో ఇవి నైతికమైనవిగానే పరిగణింపబడతాయి.

మిషనరీల నిజాయితీని వారికి తమ కార్యకలాపాల పట్ల ఉన్న శ్రద్ధని నేను శంకించడం లేదు. 19 వ శతాబ్దంలో బానిస వ్యాపారం చేసిన వారు ఎంత శ్రద్ధగా ఆ పని చేశారో స్థానిక అమెరికా జాతుల్ని, సంస్కృతుల్ని నాశనం చేసేటప్పుడు మిషనరీలు కూడా అదే శ్రద్ధని చూపారు. ఐతే వీరి శ్రద్ధ ఇతర మతాలను నాశనం చేసింది. మత విద్వేషాల్ని రెచ్చగొట్టింది.

కనుక మతమార్పిడులు మౌలికంగా అనైతికమైనవని స్పష్టమౌతోంది. ఇతరులను నరకకూపంలో పడకుండా కాపాడాలన్న ఆత్రుతలో మిషనరీ మానవహక్కుల్ని, నైతికతని కూడా లెక్కచేయుడు. మిషనరీల చరిత్రలో మంచికన్నా చెడే ఎక్కువ కనిపిస్తుంది.

ఆధ్యాత్మిక స్థాయిలో కూడా మతమార్పిడులు అనైతికమైనవే. మతమార్పిడి వ్యక్తులలోని దైవత్వాన్ని అవమానించడమే అవుతుంది. యుద్ధం తో పోలిస్తే మతమార్పిడి ఎక్కువ నష్టాన్ని కలిగిస్తుంది. ప్రపంచంలో వివిధ

దేశాల మధ్య దూరాలు, అంతరాలు తగ్గుతున్న ఈ తరుణంలో మతమార్పిడి వ్యాపారాన్ని, మూఢవిశ్వాసాల్ని ప్రక్కకు పెట్టాలి.

మన మంతా భగవంతుని స్వరూపాలమే. సకల జీవరాశుల్లో భగవంతుడు ఉన్నాడు. కనుక ఎవరైనా వదులుకోవలసినది, కొత్తగా పొందవలసినది ఏదీ లేదు. ఆత్మ చిరంతనమైనది. దానికి హిందుత్వం, క్రైస్తవం, ఇస్లాంలతో సంబంధం లేదు. ఆత్మని ఎవరూ రక్షించే అవసరం లేదు. అది పాప పుణ్యాలకు అతీతమైనది. మనని మనం అర్థం చేసుకోగలిగితే చాలు. దేశకాలమాన పరిస్థితులకి, విశ్వాసాలకి అతీతమైన ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవడమే మతపు ప్రధాన లక్ష్యం. నిజమైన మతం వ్యక్తుల ఆత్మ స్వరూపాన్ని గుర్తించి, గౌరవించాలి. మిషనరీకి ఇటు వంటి ఆలోచనా ధోరణి ఉందా?

## మిషనరీల పట్ల వ్యక్తమవుతున్న వ్యతిరేత

ఈ మధ్య మిషనరీలకి, వారి మతానికి తీవ్ర వ్యతిరేకత ఎదురవుతోంది. ఇది భారత్‌లోనే కాక మధ్య, దక్షిణ అమెరికాలలో కూడా కనబడుతోంది. మిషనరీల అసహన ధోరణి వల్లనే ఇలాంటి పరిస్థితులు ఏర్పడ్డాయని చెప్పవచ్చును.

మతం పేరు చెప్పి మీరు శతాబ్దాల తరబడి ఇతర మతాలను, సంస్కృతులను నాశనం చేస్తూ ంటే ఇతరులు మాత్రం మౌనంవహించి అన్నీ సహించాలని ఆశించకూడదు కదా.

ఇలాంటి వ్యతిరేకతవల్ల జరిగిన హింస మిషనరీలు అనేక శతాబ్దాలుగా పాల్పడిన భౌతికమైన, మానసికమైన హింసకంటే చాలా తక్కువనే చెప్పాలి.

ఈ మధ్యనే కాంగ్రెస్ పార్టీ నాయకురాలు, ఇప్పటికీ కాథలిక్కు చర్చి సభ్యురాలు అయిన సోనియాగాంధీ స్వామీ వివేకానందుడు నిజమైన మతానికి ప్రతినిధి అని ప్రకటించింది. కాని అదే వివేకానందుడు మిషనరీ కార్యకలాపాల గురించి అమెరికాలో ఏమన్నాడో చూద్దాం.

''మమ్మల్ని విమర్శించినప్పుడల్లా మీరు ఒక విషయం గుర్తు పెట్టుకోండి. భారతీయులంతా బంగాళాఖాతంలోని బురదనంతా తీసి పాశ్చాత్య దేశాలపై జల్లినా, అది మీరు మాకు చేసిన చెడుకంటే ఎంతో తక్కువే అవుతుంది.''

మహాత్మాగాంధీ కూడా మిషనరీ కార్యకలాపాల్ని తీవ్రంగా వ్యతిరేకించారు. కాని అదే కాంగ్రెస్ పార్టీ, కమ్యూనిస్టులు క్రైస్తవ మిషనరీ కార్యకలాపాల్ని సమర్థిస్తున్నారు. పైగా హిందుత్వాన్ని అసహనానికి, సంకుచితత్వానికి ప్రతీకగా చూపుతున్నారు.

కనుక మతమార్పిడులను పట్టించుకోకుండా మౌనం వహించకూడదు. వీటికి మతస్వేచ్ఛకి సంబంధం లేదు. మత మార్పిడి కార్యకలాపాలన్నీ ఒక మతాన్ని ప్రపంచమంతటా వ్యాపింపజేయడానికి అపారమైన ధనసంపదతో, పథకం ప్రకారం సాగుతున్న ప్రయత్నమని గుర్తించాలి. ఇలాంటి స్థితిలో ఎవరు ఎవరిపై దాడి చేస్తున్నారన్నది సులభంగా గుర్తించవచ్చును. ఏ పక్షం వైపు ఉండాలి, ఎవరికి మద్దతు ప్రకటించాలన్నది మీరే నిర్ణయించుకోవాలి.

# భారతదేశంలో క్రైస్తవుల అణచివేత

టి.హెచ్. చౌదరి

క్రైస్తవ మతంలోకి మారిన – మారని ఆదివాసి వర్గాల మధ్య గుజరాత్ డాంగ్స్ జిల్లాలో ఘర్షణలు చెలరేగిన సంగతి తెల్సిందే. ఈ నేపథ్యంలో అక్కడ పర్యటించిన ప్రధాని అటల్‌బిహారి వాజ్‌పాయ్ మత మార్పిడులపై జాతీయ స్థాయి చర్చ జరగాలని పిలుపునిచ్చారు. కమ్యూనిష్టులు, వారితో సహగమనం చేసే రచయితలు, చరిత్రకారులు, సెక్యులర్ పత్రికా రచయితలు, మైనారిటీ వర్గాల నాయకులు, మానవహక్కుల ప్రవక్తలు, వివిధ చర్చిల సారధులు ప్రధాని చెప్పిన జాతీయ స్థాయి చర్చలేవీ అవసరం లేదని ఉద్ఘాటించారు. యాభై ఏళ్ళ క్రితమే రాజ్యాంగంలో అన్ని వ్యవహారాలూ ఖరారయ్యాయనేది వీరందరి వాదన. తమ వాదనను సమర్థించుకునేందుకు ఈ సెక్యులర్ రథసారధులు రాజ్యాంగంలోని 25వ అధికరణాన్ని ఉటంకిస్తున్నారు. ఈ అధికరణం తమకు ఇష్టమైన మతాన్ని ఎంచుకుని, ప్రచారం చేసుకొనే హక్కును కల్పిస్తోందని సెక్యులర్ మేధావులు విశ్లేషిస్తున్నారు. వీరి హక్కుల్ని అనుసరించి రాజ్యాంగంలోని 25వ అధికరణాన్ని తప్పకుండా పాటించి తీరాలి. అలాగే మిగతా అధికరణాల్ని కూడా పాటించి తీరాలని మనం ఒకవేళ కోరితే సెక్యులర్‌మేధావుల నుండి మౌనమే జవాబుగా వెలువడుతుంది. ఉదాహరణకు చెప్పాలంటే ఉమ్మడి పౌరస్మృతి (అధికరణం-44), గోవధ నిషేధం (అధికరణం-48) లాంటివి సైతం మన రాజ్యాంగంలో ఉన్నాయి. సెక్యులర్ మేధావులు తమకు ఉపయోగపడే పరిమితాంశాల్ని మాత్రమే ఎన్నుకొని వాటినే చర్చనీయాంశాలుగా మార్చి ఆనందిస్తూ ఉంటారు. సదరు పరిమితాంశాలు హిందువులకు ఇబ్బందులు కలిగిస్తూ వేర్పాటు వాదాన్ని పెంచిపోషించేవే. మన

సెక్యులర్ మేధావులు నిత్య కల్యాణం పచ్చతోరణంలా రోజు సెమినార్లు నిర్వహిస్తూ ఉంటారు. పౌరహక్కుల నుండి మొదలుకొని లైంగిక సమానత్వం, అలీనవిధానం, మతతత్వం, క్యూబాతో స్నేహ సౌభ్రాతృత్వాల పెంపుదల, అరబ్బులు, సామ్రాజ్యవాద వ్యతిరేకత ఇలా సెక్యులర్ వాదుల సెమినార్ల శీర్షికలు వివిధ పార్శ్వాలవైపు పయనిస్తాయి. ఇవన్నీ జరుపుకోటం తప్పులేనప్పుడు. మత మార్పిడుల గురించి దేశవ్యాప్త చర్చ ఆరంభిస్తే తప్పేమిటి? అదీ మత మార్పిడులన్నీ మోసంతో కూడుకున్నవని తేలిన తర్వాతా. మత మార్పిడులకు లోనవుతున్న వారంతా విద్యాగంధం లేకుండానూ, పొట్టనిండని బ్రతుకుల తోనూ బితుకుబితుకుమంటూ కాలం గడుపుతున్నవారే. మత మార్పిడులు భారత వ్యతిరేక విశ్వాసాల్ని పెంచి పోషిస్తున్నాయి. ఒక రకమైన ఆందోళనాత్మక వాతావరణాన్ని తయారు చేస్తున్నాయి. గాంధీజీ మత మార్పిడుల్ని తీవ్రంగా వ్యతిరేకించారు. డాక్టర్ అంబేద్కర్ క్రైస్తవ, ముస్లిం మతాల్ని తిరస్కరించి, ఈ నేలలో ఉద్భవించిన బౌద్ధమతాన్నే స్వీకరించారు.

## హిందూ-క్రైస్తవ వాదోపవాదాలు

రెండు వందల సంవత్సరాల పాటు భారతదేశంలో హిందూ పండితులతో వాదనలు, చర్చలు జరిపాయి ఐరోపా, అమెరికాలకు చెందిన క్రైస్తవ మిషనరీలు. సమాజంలో మేధావిగా గుర్తింపు పొందిన బ్రాహ్మణుడు క్రైస్తవాధిక్యాన్ని గుర్తిస్తేచాలు, సంఘంలోని మిగతా వారిని తమ మతంవైపు ఆకర్షించుకోవడంకష్టమేమీ కాదని క్రిష్టియన్ మిషనరీలు గుర్తించాయి. క్రైస్తవానికి బ్రాహ్మణుడు గ్రీన్ సిగ్నల్ ఇచ్చినట్టయితే ఇతర కులాల వారితో

సులువుగా మత మార్పిడులు జరిపించవచ్చునని క్రిష్టియన్ మిషనరీలు ఆశపడ్డాయి. అయితే భౌతికమైన వాదోపవాదాల్లో క్రైస్తవ మిషనరీలు విజయాన్ని సాధించలేకపోయాయి. క్రైస్తవ మిషనరీలు డబ్బొ దస్కం వస్తు వాహనాలతో ప్రలోభ పెడుతూ తమ మతాన్ని విస్తరింపజేయాలనుకున్నాయి, కానీ రాజారామ మోహన్‌రాయ్, దయానంద, వివేకానంద, గాంధీజీలు వారి ఆటలు సాగనివ్వలేదు (ఈ విషయాలన్నీ సీతారాం గోయల్ రాసిన 'హిస్టరి ఆఫ్ హిందూ క్రిష్టియన్ ఎన్‌కౌంటర్స్ **304** నుండి **1996**' దాకా అన్న పుస్తకంలో ఆసక్తికరంగా వివరించబడ్డాయి). హిందూ సమాజంలోని మేధావి వర్గాన్ని తమ దారికి తెచ్చుకోవడంలో విఫలమైన క్రైస్తవ మిషనరీలు చివరకు నిస్పృహకు లోనయ్యాయి. తదనంతర కాలంలో మిషనరీలు ఎలాంటి చర్చలకు తావునివ్వ లేదు. చర్చల బదులుగా నిరక్షరాస్యులపై కన్నువేశాయి మిషనరీలు. జన బాహుళ్యానికి దూరంగా అడవుల్లో బతుకుతున్న ఆదివాసీలు, బీదసాదలు మిషనరీల లక్ష్యంగా మారారు. మిషనరీలకు డబ్బు ప్రవాహంలా వచ్చి పడింది. మతం మారుతున్న వనవాసుల్ని హిందూ ధర్మానికి మరింత దూరం చేసేందుకు మిషనరీలు వ్యూహరచన చేశాయి. హిందూ పురాణాల్లోని శివుడిలాంటి దేవతల్ని కించపరచే ప్రదర్శనలు విరివిగా చేపట్టాయి మిషనరీలు.

## మత మార్పిడులు-గాంధీజీ

గాంధీజీ క్రైస్తవ మిషనరీల మధ్య సాగిన వాద ప్రతివాదాల్ని గురించి పాఠకులకు ఈ వ్యాసంలో తెలియచేయాలనుకుంటున్నాను.

గాంధీజీతో హరిజనుల్ని, వనవాసుల్ని హిందూ మతం నుండి

క్రైస్తవంలోకి మార్చడం తప్పేమి కాదని ఒప్పించలేకపోయారు క్రైస్తవ మిషనరీల వారు, ఆయన మిత్రులు. గాంధీజీ తన మిత్రులు , అభిమానులు, క్రైస్తవ మిషనరీలతో ఆ మేరకు జరిగిన చర్చల్ని హరిజన్ పత్రికలో ప్రకటింపజేశారు.

క్రైస్తవ వైద్యశాలల నుండి అందే బహుమతుల్ని గురించి 18 జూలై 1936 హరిజన్ పత్రిక క్రిష్టియన్ మిషనరీ సంస్థలకు చెందిన పెర్రిసిరిసోల్, తదితరులతో గాంధీజీ జరిపిన చర్చల్ని ప్రచురించింది. హరిజన్ పత్రిక ప్రచురణాంశం క్రైస్తవ మిషనరీల మనస్తత్వానికి అద్దం పడుతోంది. మత మార్పిడులపై గాంధీజీలో ఉన్న వ్యతిరేకతను కూడా సూచిస్తోంది. ఆ సంభాషణ చదవండి.

మిషనరీ ప్రతినిధి (మహిళ ): మత మార్పిడి జరిపించాలన్న కోరికగానీ, దానికి అవసరమైన సమయంగానీ నాకు లేవు. మా ఆస్పత్రి ద్వారా ప్రజలంతా క్రైస్తవ మార్గంలోకి వస్తే అమితంగా ఆనందిస్తాను.

గాంధీజీ: అంటే ఆస్పత్రిలో వైద్య సౌకర్యాలు అందించడమనే సేవ ద్వారా రోగులందరూ క్రైస్తవులుగా మారాలనే బహుమతినిస్తున్నారా?

మిషనరీ మహిళ : అవును. ఇలాంటి బహుమతి ఆశించదగిందే. మా సేవలు అవసరమైన ప్రాంతాలు ఈ విశాల విశ్వంలో చాలా చోట్ల ఉన్నాయి. కానీ మేం అక్కడకు వెళ్ళకుండా ఇక్కడికే వచ్చాము.

గాంధీజీ: స్వచ్ఛమైన సేవకు సంబంధించిన పరికల్పన మీ మనసులో లేదని అర్థమవుతోంది. సేవలకు ప్రతిఫలంగా చాలామందిని క్రైస్తవ చాపల్యంలోకి రప్పించాలని మీరు కోరుకుంటున్నారన్నమాట.

## ఇంట్లో పని లేదు. మరి ఇక్కడ ఎందుకు ?

అసలింతకీ క్రిష్టియన్ మిషనరీలకు తమ స్వదేశంలో ఎలాంటి పనులూ

ఉండవా? ఒకవేళ మిషనరీలు తమ స్వదేశంలోనే ఉంటేసంతోషిస్తారా మీరు? అంటూ గాంధీజీని ప్రశ్నించారు పెర్రీసిరిసోల్( అతనో క్రిష్టియన్ మిషనరీ). 'నేను అలా ఏమీ చెప్పలేను. అయితే మీరంతా అమెరికాను దాటి ఎందుకు వస్తున్నారో నాకేనాడు బోధపడటం లేదు. ఇంతకీ అమెరికాలో చక్కదిద్దాల్సిన పనులేవీ లేవా?' అని అన్నారు గాంధీజీ.

'అమెరికాలోనూ విద్యావిషయకమైన ఎన్నో పనుల్ని చేసే అవకాశం ఉంది' అని జవాబు చెప్పారు పెర్రీసిరిసోల్.

ఏ పరిస్థితుల్లోనైనా సరే మత మార్పిడుల్ని అంగీకరించని తత్వం గాంధీజీ స్వంతం. ఈ విషయంలో ఆయనది రాజీలేని విధానం. ఈ నిజాన్ని విన్న మిషనరీ అధినేత జాన్ ఆర్.మెట్నో రెండో పర్యాయం గాంధీజీ సందర్శనార్థం వచ్చారు. క్రైస్తవ మతస్తుల్లో గాంధీజీకి అత్యంత ప్రీతిపాత్రుడైన సి.ఎఫ్.ఆండ్రూస్ కూడా అప్పుడాయనవెంట ఉన్నారు. గాంధీజీ అభిప్రాయ తీవ్రతను తగ్గించేందుకు యత్నించారు ఆండ్రూస్. ఈరోజు క్రైస్తవ మిషనరీలు చేస్తున్నవేవీ ఆధ్యాత్మిక వికాసానికి దోహదపడేవి కావని నా అభిప్రాయం అన్నారు గాంధీజీ. ఒకవేళ ఇవే మిషనరీలు భారతదేశానికి ధనసంపత్తుల్ని కూర్చితే అప్పటి మాటేమిటి? అని తనదైన శైలిలో ఒక ప్రశ్నను సంధించారు మెట్నో ఎలాంటి హానీ కలగకుండా వివేకవంతమైన మార్గాల్లో డబ్బును ఇవ్వగలరా? డబ్బుకు ఏమైనా విలువ ఉంటుందా? అని గాంధీజీ జవాబు చెప్పారు. డబ్బులు కుమ్మరిస్తే ఆ చర్య హానికరమవుతుంది. అవసరమున్నప్పుడే డబ్బును సంపాదించాలి. బ్రిటన్ అమెరికా మిషనరీ సొసైటీల నుండి వస్తున్న ధనం మేలుకన్నా ఎక్కువ కీడు చేస్తుందన్నది నా అవగాహనలోకి వచ్చిన సత్యం అన్నారు గాంధీజీ. 'ధనదేవతనూ, భగవంతుడిని ఏక సమయంలో సేవించడం అసాధ్యం. నా భయమేమిటంటే, భారత సేవ పేరుతో డబ్బును మాత్రమే పంపుతున్నారు. ఈ హడావిడిలో భగవంతుడి సంగతులు వెనక్కి

వెళ్ళిపోయాయి. దీనికి ఏదో ఒక రోజు ఆ భగవంతుడు ప్రతీకారాన్ని తీర్చుకుంటాడు.' అని చెప్పారు గాంధీజీ. 'అమెరికన్లు డబ్బుతో సేవ చేస్తామని భ్రమపడితే వారిని నేను బెదరగొడతాను. మీ ఇంజనీర్ల శాస్త్ర విజ్ఞానం మాకు ప్రయోజనాల్ని అందిచాలన్న భావనతోనే వారిని ఇక్కడికి పంపండి, డబ్బు సంపాదనకు మాత్రం కాదు అని చెబుతాను' అంటూ వివరించారు గాంధీజీ.

## భయంకరమైన విషతుల్యం మత మార్పిడి

మత మార్పుడుల్ని భయంకరమైన విషతుల్యాలుగా భావించారు గాంధీజీ. కేథలిక్ తత్వం మాత్రమే అసలు సిలలైన మతమని భావించే ప్రొఫెసర్ క్రిజిన్స్కీతో 1937 జనవరి 2వ తేదీనాడు గాంధీజీ చర్చించారు. దీనికి సంబంధించిన చర్చా నివేదిక అదే నెల 16వ తేదీ హరిజన్ పత్రికలో ప్రచురణ పొందింది.

గాంధీజీ: అంటే మిగతా మతాలన్నీ అసత్యాలతో కూడుకున్నవన్నదే మీ అభిప్రాయమా.

క్రిజిన్స్కీ : ఒకవేళ ఇతరులు తమ మతాలు నిజమైనవని సమర్థవంతంగా వివరించుకోగలిగితే వారు రక్షించబడినట్టే.

గాంధీజీ: అంటే అసత్యమైనప్పటికీ దాన్ని చెబుతున్న వారెవరైనా రక్షించబడతారనే మీరు అంటారన్న మాట. అంటే తాను చెబుతున్నది అసత్యమని తెల్సినా అతడు రక్షణ పొందుతాడన్నమాట. అలాగే మీరు నడుస్తున్న మార్గం తప్పని తెల్సినా, అది సరియైనదేనని వివరించుకోగలిగితే మీరు సైతం రక్షించబడతారన్నమాట.

తాను ఎన్నో మత విషయాల్ని అధ్యయనం చేసి, అన్నింటినీ

తులనాత్మకంగా పరిశీలించిన తర్వాతనే తాను ఎంచుకున్న మార్గం సరియైనదన్న నిశ్చయానికి వచ్చినట్టు చెప్పుకున్నారు క్రిజిన్స్కి. ఈ సమాధానం గాంధీజీకి సంతృప్తిని కలిగించలేకపోయింది. గాంధీజీ దృష్టిలో మతమనేది బౌద్ధిక పరీక్షకు సంబంధించిన అంశం కానే కాదు. 'మీ ధోరణి దుందుడుకు తనాన్ని సూచిస్తోంది' అని ప్రొఫెసర్ క్రిజిన్స్కితో అన్నారు గాంధీజీ. అప్పుడు ప్రొఫెసర్‌గారు మరో ప్రశ్నవైపు దృష్టి మరల్చారు. భౌతిక వాదంపై పోరాటం అన్నదే ఆ ప్రశ్న. 'మతమార్పిడి అనే భావజాలాన్ని విడిచిపెట్టకుండా ఇలాంటి శక్తులతో ఎన్ని పోరాటాలు చేసినా అది వృధా ప్రయాస అవుతుంది. మత మార్పిడి అన్నది ఓ భయంకరమైన విషమని మీతో స్పష్టం చేస్తున్నాను' అంటూ తేల్చి చెప్పారు గాంధీజీ.

'కానీ మీరంటే నాకు ఎంతో గొప్ప గౌరవం ఉంది' అంటూ నిష్క్రమించబోయాడు ప్రొఫెసర్. 'అది చాలదు. ఒకవేళ నేను కేథలిక్ చర్చిలో చేరిపోతే మీ గౌరవం మరింత పెరుగుతుంది' అంటూ జవాబిచ్చారు గాంధీజీ. దీనికి ప్రొఫెసర్ అంగీకారాన్ని తెల్పారు. 'అలాంటిదేదైనా జరిగితే మీరు సెంట్ ఫ్రాన్సిస్ అంత గొప్పవారయ్యారన్న మాటే' అన్నారాయన. 'ఏం, ఒక హిందువు సెంట్ ఫ్రాన్సిస్ కాలేడా?' అని గాంధీజీ ప్రశ్నించారు. (ఇక్కడ పాఠకులు ఒక విషయాన్ని గుర్తుకు తెచ్చుకోవాలి. నష్టభూయిష్టమైన ఖిలాఫత్ ఉద్యమంలో గాంధీజీ సహచరుడు మహమ్మదాలీ జిన్నా ఓ వ్యాఖ్య విసిరారు. తన మతాన్ని అనుసరించి, ఒక అబద్ధాలకోరు, తప్పుడు ప్రవర్తన ఉన్నవాడు, హంతకుడు అయిన ముస్లిం కూడా గాంధీజీ కన్నా గొప్పవాడేనన్నదే ఆ వ్యాఖ్య. నిజంగా ఈ మాట మీరన్నారా అని జిన్నాను తిరిగి అడిగితే అతడు అవుననే జవాబిచ్చాడు.

మత మార్పిడులపై గాంధీజీ వ్యతిరేకత మరో సందర్భంలోనూ స్పష్టపడింది. ఒకసారి ఒక పోలెండ్ విద్యార్థి గాంధీజీ ఆటోగ్రాఫ్‌తో ఉన్న

ఆయన ఫోటో తీసుకున్నాడు. కేథలిక్ ఫాదర్లు నిర్వహించే ఒక పాఠశాలకు ఆర్థికంగా చేయూతనందించే ఉద్దేశ్యంతోనే ఆటోగ్రాఫ్ ఫోటోను తీసుకున్నానని ఆ పిల్లవాడు గాంధీజీతో చెప్పాడు. అప్పుడు వెంటనే గాంధీజీ తన ఫోటోను వెనక్కి తీసుకున్నారు. 'మత మార్పిడుల విషయంలో ఫాదర్లకు నా సహాయం ఉంటుందని ఏనాడూ ఆశలు పెట్టుకోకు. వారేం చేస్తారో నీకసలు తెలుసా?' అని ప్రశ్నించారు గాంధీజీ. 1936 జనవరి 27నాటి హరిజన్ పత్రికలో ఈ వివరాలన్నీ ఉన్నాయి. తిరుచెంగోడులో జరిగిన హిందూ దేవాలయ ధ్వంసం, హిందూ దేవతల్ని అవమానించడం లాంటి విషయాలన్నీ ఆ సంచికలో పొందుపర్చారు.

క్రైస్తవ మిషనరీలు దేశం నుండి వెళ్ళిపోవాలని విస్పష్టంగా ప్రకటించారు గాంధీజీ.

'ఒకవేళ భారతదేశం స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న తర్వాత, అమెరికా తదితర విదేశీ క్రైస్తవ మిషనరీలు ఇక్కడే ఉండాలనుకుంటే మీరేమంటారు?' అని 1931 మార్చి 21వ తేదీనాడు పత్రికా విలేకరులు ప్రశ్నించారు ఆయనను. 'విద్య, ఆరోగ్యం, పేద వర్గాలకు సేవలాంటి మానవతా సంబంధమైన అంశాల్ని విశుద్ధంగా స్వీకరించకుండా దానికి మత ప్రచారాన్ని జోడీ చేస్తే అలాంటి మిషనరీలు దేశం విడిచి వెళ్ళాలనే నేను చెబుతాను' అంటూ నిర్ద్వందంగా చెప్పారు గాంధీజీ. ప్రతి దేశం తన స్వీయ విశ్వాసాలు మిగతా దేశాల విశ్వాసాలతో సమానమేనని భావిస్తుంది. భారత ప్రజ స్వీకరించిన విశ్వాసాలు ఈ దేశ అవసరాలకు సరిపోతాయి. స్వీయ విశ్వాసం నుండి మరో విశ్వాసంలోకి పరుగులు పెట్టాల్సిన అవసరం భారతదేశానికి ఏ మాత్రం లేదు.

మత మార్పిడులకు వ్యతిరేకంగా చట్టం రూపొందాలని గాంధీజీ ఆకాంక్షించారు. ఆయన ఒక మిషనరీ నర్స్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూను 1935

మే 11వ తేదీనాడు ప్రచురించింది హరిజన్ పత్రిక. 'బాప్టిస్టు ప్రచారానికై భారతదేశానికి మిషనరీలు వస్తాయనుకోండి, మీరు అందుకు వ్యతిరేకమా? అన్నది నర్స్ ప్రశ్న. ' నాకే కనుక చట్టాన్ని రూపొందించే అధికారం ఉంటే, మత ప్రచారసంస్థలన్నింటినీ అడ్డుకుంటాను' అని జవాబు గాంధీజీ. హిందూ సమాజంలో మిషనరీల రాక కట్టుబాట్లు, వేషభాషల్లో ఎన్నో అవాంతరాల్ని సృష్టిస్తుందని ఆయన అన్నారు. 'మీరు చెబుతున్నదంతా పాత పురాణం కాదా?' అని ప్రశ్నించింది నర్స్. గాంధీజీకి మిషనరీల మాయమాటలు, పద్ధతులు బాగా తెల్సు. 'బయటకు కన్పిస్తున్న పరిస్థితులన్నీ మారుతున్నట్టు తెలుస్తోంది. కానీ అంతర్గత పరిస్థితులు ఎప్పటిలాగే ఉన్నాయి' అని అన్నారు గాంధీజీ. నిజానికి మిషనరీల దృక్పథంలో కనుక సకారాత్మకమైన మార్పు వచ్చిఉంటే హిందూ దేవతల్ని కించపర్చే మోర్టాక్ పుస్తకాల్ని మిషన్ డిపోల్లో అమ్మేవారేనా? ఇలాంటి పుస్తకాలపై నిషేధం విధించాలని మిషనరీలు ఏనాడైనా భావించారా? ఒక రోజు మిషనరీలు కరువుకాటకాలు తాండవించే ప్రదేశానికి చేరుకుంటారు. ఆ ప్రాంతంలో డబ్బును మంచి నీళ్ళలా వెదజల్లుతారు. అటు తర్వాత కరువు పీడితుల్ని తమ మత బాహువుల్లో బంధిస్తారు. మెల్లగా ఆలయాలపై కబ్జా మొదలెడతారు. నిన్నటి దాకా ఆ ఆలయంలోని దైవాన్ని భక్తితో పూజించిన వారి చేతుల మీదుగానే, దాని విధ్వంసాన్ని ప్రోత్సహిస్తారు మిషనరీలు.

గాంధీజీతో మిషనరీల చర్చలు ఎన్నోసార్లు జరిగాయి. ప్రతిసారీ మిషనరీల మత మార్పిడి దృక్పథాన్ని ఆయన ఖండిస్తూనే వచ్చారు. జీసస్ మాత్రమే దైవ కుమారుడన్న వాదనను గాంధీజీ ఏనాడూ అంగీకరించలేదు. దురదృష్టవశాత్తూ భారత రాజ్యాంగ రచనా సమయానికి గాంధీజీ జీవించి లేరు. ఆయనే కనుక బ్రతికి ఉంటే మత మార్పిడులపై నిషేధాన్ని విధించే చట్టాన్ని తయారు చేయించేవారే. జవహర్‌లాల్ నెహ్రూ హిందూ వ్యతిరేక

వైఖరి వల్లనే కాశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తిని కలిగించే 370, మత ప్రచారాన్ని జరుపుకునే అవకాశాన్ని కలిగించే 25వ అధికరణాలు రాజ్యాంగంలో వచ్చి చేరాయి.

## మత ప్రచారం. కె.సి. నియోగి కమీషన్

మన రాజ్యాంగంలో హిందువుల్ని (ముస్లింలు కాదు సుమా ) క్రైస్తవంలోకి మార్పిడి చేసే 25వ అధికరణం ఉంది. దీని వెనుక ఒక విషాధ భరితమైన గాథ ఉంది. రాజ్యాంగ రచన ప్రాథమిక దశలో ఉన్నపుడు అధికరణంలో మతాన్ని గురించి బహిరంగంగా చెప్పుకుని, ఆచరించేందుకు మాత్రమే వీలు ఉండేది. గాంధీజీ మరణానంతరం జవహర్‌లాల్‌నెహ్రూ ఆదరణకు పాత్రులు కావాలన్న తహతహతో రాజ్యాంగ నిర్మాతలు దీనికి ప్రచార పదాన్ని కూడా చేర్చారు. బాబూ రాజేంద్రప్రసాద్, పురుషోత్తమదాస్ టాండన్, లోక్‌నాథ్ మిశ్రా, అనంతశయనం అయ్యంగార్ లాంటి కాంగ్రెస్ దిగ్గజాలు ఆ పదాన్ని చేర్చవద్దని అన్నారు. కానీ నెహ్రూ హిందూ వ్యతిరేకత ముందు వీరి వాదాలేవీ నిలబడలేదు. మొత్తానికి మత ప్రచారం జరుపుకునే హక్కును 25వ ఆధికరణం ప్రసాదించింది. ఇలా జవహర్‌లాల్ నెహ్రూ పుణ్యమా అని హిందూ వ్యతిరేక , మత మార్పిడులకు వెసులుబాటు ఏర్పడింది.

రాజ్యాంగపరమైన సౌకర్యం లభించడంతో మిషనరీ సంస్థలు దేశంలో వెల్లువలా వచ్చి పడ్డాయి. డబ్బు దస్కంతో సహా వచ్చారు మిషనరీ ప్రముఖులు. మత మార్పిడులు జోరుగా సాగాయి. ఈ నేపథ్యంలో మోసపూరిత మైన మత మార్పిడుల్ని గురించి విచారణ జరిపేందుకు కె.సి. నియోగి నేతృత్వంలో

ప్రభుత్వం ఒకకమిటీని నియమించింది. ఈ కమిటీ 1956లో తన నివేదికను సమర్పించింది. మత మార్పిడుల పేరిట మిషనరీలు జరుపుతున్న అవకతవకల్ని నియోగి కమిటీ బయటపెట్టింది. ముఖ్యంగా గిరిజనులను క్రైస్తవంలోకి మళ్ళిస్తున్న తీరును విశదీకరించింది. కానీ నాటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ నియోగి కమిటీ వెల్లడించిన నిజాల్ని ఏ మాత్రం పట్టించుకోలేదు. అయితే మధ్య ప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు మాత్రం మోసపూరిత మత మార్పిడుల్ని నిషేధిస్తూ చట్టాలు తెచ్చాయి. క్రిష్టియన్ సంస్థలు ఈ చట్టాల్ని సవాల్ చేస్తూ న్యాయస్థానాల్ని ఆశ్రయించాయి. కానీ అత్యున్నత న్యాయస్థానం మధ్యప్రదేశ్, ఒరిస్సా చట్టాల్ని అంగీకరించింది. అంతేకాదు, హిందువులకు సైతం, ఇతర మతాల వారిని తమ మతానికి మార్పిడి చేయించే హక్కు ఉందని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది.

## ఇప్పటి పరిస్థితులు – కొన్ని ప్రశ్నలు

మత మార్పిడి వాదుల కుహనా వాదనలు, వారి మద్దతుదారుల ప్రవచనాలతోపాటు నేటి పరిస్థితుల్ని ఒక్కసారి పరిశీలిద్దాం.

భారతదేశాన్ని మత మార్పిడులకు లక్ష్యంగా ఎంచుకున్నారు. ముస్లిం దేశాలు మత మార్పిడులకు అంగీకరించనందువల్లనే భారతదేశం వారికి లక్ష్యంగా మారింది. ముస్లిం దేశాలు మతం మార్పించినవాడికీ, మార్చుకున్న వాడికీ మరణదండన విధిస్తాయి. చైనా కూడా అదే పని చేస్తుంది. ఇంకా చెప్పుకుంటూ పోతే చైనాకు ఈ విషయంలో ఘనమైన చరిత్ర ఉంది. జపానీయులు మత మార్పిడిని ఒప్పుకోరు. వీలైతే మిగతా వారిని వారిలో కలుపుకుంటారు. బౌద్ధ సంస్కృతి పట్ల వారి అభిమానం మెండు. ఇక

మిగిలింది 100 కోట్ల భారతీయులు. పశ్చిమ దేశాల నుండి వచ్చే ధనసహాయం వల్లనే ఇక్కడి మిషనరీలు మత మార్పిడులు జరుపుతున్నారని హిందువులు చాలా నింపాదిగా అర్థం చేసుకుంటున్నారు. హిందువుల సంప్రదాయ సహన భావనను దోపిడీ చేస్తున్నారు మిషనరీలు. నిజానికి భారతదేశంలో ముస్లింలు అతి బీదవారు, నిరక్షరాస్యులు, ఉద్యోగార్హత సంపాదించలేకుండా ఉంటున్నవారు. అయితే వారిని తమ మతంలోకి మార్చుకునేందుకు మిషనరీలు సాహసించరు. ఇలా హిందూ సహనం దుర్వినియోగమవుతోంది.

క్రిష్టియన్ మతంలోకి వెళ్ళడం ద్వారా బీద హిందువులు తమ స్థితిగతుల్ని మెరుగుపర్చుకోగలరని వాదిస్తూ ఉంటారు. ఇదో బ్రహ్మాండమైన అబద్ధం. ఉదాహరణకు ఫిలిప్పీన్స్‌నే తీసుకుందాం. అక్కడ స్పానిష్ వలసవాదులు అందరి చేతా మత మార్పిడులు జరిపించారు. అప్పట్లో ఫిలిప్పీనీయులంతా బీదవారే. మత మార్పిడులు జరిగి ఇప్పటికి నాలుగు వందల సంవత్సరాలు కావస్తోంది. అయినా ఇప్పటికీ వారు అదే స్థితిలో ఉన్నారు. ఆగ్నేయాసియాలో బీదరికం ఎక్కువగా ఉన్న దేశం ఫిలిప్పీన్స్. తెల్లజాతీయుల విషయానికొస్తే, క్రిష్టియన్‌లే అయినప్పటికీ లాటిన్ అమెరికావారు బీదవారే. క్రైస్తవంలోకి వెళ్ళినప్పటికీ ఉత్తర, దక్షిణ అమెరికాల్లోని రెడ్ ఇండియన్లు ప్రపంచంలో అతి బీదవర్గాలుగా చెలామణీ అవుతున్నారు . అంటే మత మార్పిడి చేసుకునే సమయంలో క్రైస్తవ మిషనరీలు ప్రాథమిక స్థాయిలో అందించే ఆర్థిక సహాయాలు, తదనంతరం వారి జీవితాల్లో వెలుగుల్ని నింపలేవని అర్థమవుతోంది కదూ.

క్రైస్తవంలోకి వెళితే బీదరికం, దోపిడీ, దళిత వివక్షత పోతాయనడం మరో శుద్ధ అబద్ధం. దీనికి దక్షిణాఫ్రికా ఒక నిదర్శనం. ఆ దేశానికి చెందిన ప్రముఖుడు డెస్మండ్ టుటు మాటల్లోనే చెప్పాలంటే. 'మా దేశానికి క్రైస్తవులు

వచ్చిన రోజుల్లో వారి చేతిలో బైబిల్ ఉండేది. మా చేతుల్లో భూమి ఉండేది. కానీ ప్రస్తుతం వారి చేతిల్లో భూమి ఉంటే మాకు మాత్రం బైబిల్ మిగిలింది.'

క్రైస్తవం కుల రహితమని క్రైస్తవ మిషనరీలు చెప్పుకుంటారు. ఇది భారతదేశంలో దళితుల్ని మభ్య పెట్టేందుకు చెబుతున్న మాట. తాము చెబుతున్నదాంట్లో నిజం లేదని దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లకై డిమాండ్ చేస్తూ నిరూపించుకుంటున్నారు మిషనరీల ప్రముఖులు. అంటే క్రైస్తవం కులరహితమనే ప్రచారం దళితుల్ని ఆకర్షించేందుకేనని తేలిపోతోంది.

క్రైస్తవ మత సంఘాల విషయానికొస్తే, భారతీయ చర్చిల్లో దళితులకు రిజర్వేషన్లు లేవు. అలాగే క్రైస్తవ పాఠశాలలు, కళాశాలల్లోనూ ఇదే పద్ధతి. తమ సంస్థల్లోనే ఇలాంటి పరిస్థితులు నెలకొని ఉన్నపుడు దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లు కావాలని మిషనరీలు డిమాండ్ చేయడమేమిటి? ఇక్కడ ఇంకొక సంగతిని కూడా గమనించాలి. దక్షిణాఫ్రికాలో నల్ల జాతీయులు క్రైస్తవంలోకి మార్చబడ్డారు. అయినప్పటికీ అక్కడి తెల్లజాతి క్రైస్తవులు వారిని అస్పృశ్యులుగానే భావించారు. అలాంటిది తమ మతంలో అస్పృశ్యత లాంటి దుర్గుణాలే లేవని మిషనరీలు చాటుకుంటూ ఉంటారు.

'మీ హిందువులు క్రైస్తవుల్ని మత మార్పిడి చేయించడం లేదా? అలా కాకుంటే అమెరికాలో, యూరోప్‌లలో అంతమంది గురూజీలు, స్వాములు, సాధువులు, వారి మిషన్‌లు ఎందుకు ఉన్నట్లు?' అని కొంతమంది క్రైస్తవ నేతలు ప్రశ్నిస్తున్నారు. దీనికి సులువైన సమాధానం ఉంది. ఏ హిందూ మిషనరీ లేదా సాధువు క్రైస్తవ మిషనరీల వలె ధన సంపత్తితో ఉన్నవారు కారు. భారతదేశంలో చాలామంది పేదసాదలకు పూటగడవడమే కష్టం. ఈ పరిస్థితుల్లో హిందూ సాధువర్గాలకూ, మిషన్‌లకూ క్రిష్టయన్ మిషనరీ వలె బిలియన్ల కొద్దీ డాలర్లు వెచ్చించడం సాధ్యమయ్యే పనేనా? అయినప్పటికీ అమెరికాలో ఉన్న సాధువులు క్రిష్టియన్ వారిని మత మార్పిడులు

జరుపుతున్నారన్నది ఊహలకు సైతం అందని విషయం. ఇలాంటి సాధువులు అందించ గలిగేది మేధోపరమైన, ఆధ్యాత్మిక సంబంధమైన విజ్ఞానాన్ని మాత్రమే. విద్యాధికులు, అన్ని విషయాల్లోనూ అగ్రగాములుగా ఉన్నవారు మాత్రమే అక్కడ క్రైస్తవం నుంచి హిందూమతంలోకి వస్తున్నారు. నిరుపేదలు, నిరక్షరాస్యుల్ని క్రైస్తవ మిషనరీలు మభ్య పెడుతున్న వైనాలతో పోల్చితే ఇది పూర్తి భిన్నంగా కన్పిస్తుంది.

## మత మార్పిడుల సంఘం

భారతదేశంలో ఎలాంటి ముందు వెనకల్ని చూడకుండా జరుగుతున్న మత మార్పిడుల్ని నిషేధించాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే ఇలాంటి మత మార్పిడులన్నీ మోసపూరితంగానే ఉంటున్నాయి కనుక రాజ్యాంగంలో చెప్పిన మత ప్రచార హక్కు దుర్వినియోగం అయ్యేందుకు వీలులేదు. ఇందు కోసం మత మార్పిడుల సంఘంఅవసరం. మతాన్ని మార్చుకోవాలను కుంటున్న వ్యక్తి ముందుగా ఆ సంఘం ముందుకు వచ్చి తన అభిప్రాయాలను వెల్లడించుకోవాలి. సంఘం ముందు సదరు వ్యక్తికి తాను మారాలనుకుంటున్న మతంపై ఏ మాత్రం అవగాహన ఉందో తేలిపోవాలి. ఈ సంఘంలో ఇతర సభ్యులతో పాటు హిందూ, క్రైస్తవ, ముస్లిం ప్రతినిధులు ఒక్కొక్కరు ఉండాలి. సచ్ఛీలుడు, నీతిమంతుడు అయిన న్యాయమూర్తి దీనికి సారధ్యం వహించాలి. సంఘన్ని సంతృప్తి పర్చిన తర్వాతనే ఎవరైనా సరే తన మతాన్ని మార్చుకునేందుకు అనుమతినివ్వాలి.

★★★

# ప్రజ్ఞా భారతి ఇతర ప్రచురణలు

★ ఇస్లాంతో జీవించడం ఎలా ? వెల రూ. 5.00

అరుణ్ శౌరి - మోలానా వహీదుద్దీన్ ఖాన్ సంవాదం

★ భారత దేశంలో క్రైస్తవ మిషనరీలు మేలు చేస్తున్నాయా? కీడు చేస్తున్నాయా?

(అరుణ్ శౌరి - ఫాదర్ అగస్టీన్ కంజమల సంవాదం) వెల రూ. 10.00

★ Rousing Hindu Consciousness వెల రూ. 20.00

A compilation of the Speches and writings of H.H.

- Swamy Chinmayananda.

★ ఇస్లామిక్ సత్వాల ప్రపంచం వెల రూ. 20.00

అరుణ్ శౌరి రచన - ది వరల్డ్ ఆఫ ఫత్వాస్ సంక్షిప్త అనువాదం

క్రొత్తగా వెలువడినవి

★ హిందూ జీవన విధానం మానవాళికి మార్గదర్శి వెల రూ. 25.00

★ పార్థా పరాక్రమించు వెల రూ. 25.00

(ఆధునిక యుగంలో హిందుత్వం)

పై రెండు పుస్తకములు శ్రీ డెవిడ్ ఫ్రాలే, డైరెక్టర్, అమెరికన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ వేదిక్ స్టడీస్, సాన్‌టాఫీ, న్యూ మెక్సికో, యూ.ఎస్.ఎ., వారి రచనల అనువాదం.

★ మైనారిటీలు - హిందుత్వం వెల రూ. 5.00

★ **HINDU HERITAGE** వెల **RS. 50/-**

★ The Ethics of Religious Conversions వెల రూ. 20.00

డేవిడ్ ఫ్రాలే, ఆర్చిబిషప్ అరులప్పల సంవాదం.